దాసభారతీ ప్రచురణలు :

# బాటసారి

[ గూఢార్థకావ్యము ]

కృతికర్త

మహాకవి

శ్రీ ఆదిభట్ల నారాయణదాసు

: సంపాదకుడు :

ఆచార్య శ్రీ యస్వీ జోగారావు,
ఎం. ఏ., పిహెచ్. డి.

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు.

ప్రచురణ

కర్రా శ్యామలదేవి

*Prof*. **S. V. JOGA RAO,** *M. A., Ph. D.*
HEAD OE THE DEPARTMENT OF TELUGU
Andra University, waltair
(Formerly Professor of Telugu
University of Leningrad U. S. S. R.)
Syndicate member, Andhra University.

# సంపాదకీయము

## దాసభారతి

జీవితము నొక కాలక్షేపముగా గాక ఒక కఠోర వ్యాసంగముగా, ఒక కళాకేళిగా, ఒక మహాతపస్సుగా, ఒక మధురానుభవముగా గడపిన మహాభాగు డతడు. అతని పండిన గుండెనుండి బాహిరిల్లి న దొక బహుముఖీన సాహిత్యము. అందు శ్రవ్య దృశ్య కావ్యములు గలవు. హరికథలు గలవు, హాస్యకథలుకలవు, శతకములు గలవు. వ్యాసములుగలవు. విమర్శలు గలవు. పద పద్య గద్యములు వేసిన వాలకము లనేకము గలవు. బహు భాషా వైదుష్య ఫలములు గలవు. కాని చిత్రము, అంతటి సారస్వత మహాస్రష్టకు, అంతటి కవితాంతర్ద్రష్టకు హరికథా పితామహుడుగా మాత్రమే పేరు మిగిలినది. ఆదిశంకరు డంత మహాకవియయ్యు, వివేకానందు డంత విశ్వకవియయ్యు చివరికి ప్రవక్తలుగా మాత్రమే వారు లబ్ధ ప్రతిష్ఠులైరి. ఒక అన్నమయ్య, ఒక క్షేత్రయ్య, ఒక త్యాగయ్య – కవితా సరస్వతీ కళాస్థానము లంటిన సరసాగ్రేసర చక్రవర్తులయ్యు వీను మిగిలిన వాగ్గేయకారులుగా మాత్రమే వాసికెక్కిరి. కవి చరిత్ర గ్రంథము లందు వారి పేరులు కానరావు. ఏల ? వారి వారి ప్రధాన కర్మ క్షేత్రములు వేరు వేరు. అట్లి దైనది ఆదిభట్ల వారి సంగతి. కవిత కాదు వారి ప్రధానకర్మ క్షేత్రము. హరికథ వారి జీవిత సర్వస్వము.

## గ్రంథపరికల్పన సముద్దేశము

వారి 46 కృతులలో 14 హరికథలు (14 సంపుటములు – 21 కథలు). హరి దాసులు వల్లెవేసి కొనుటయే గాని వానికి సాహిత్య జగత్తున పఠన పాఠనములు లేవు. 13 అచ్చ తెలుగు కృతులు. ప్రాచీనములైన అచ్చ తెలుగు కృతులే తెలుగు వారి కచ్చివచ్చినవి కావు. ఒక యెనిమిది కృతులు కేవల సంస్కృత భాషా ఘటి తములు. అన్యుల గీర్వాణమునకును హర్షించు ఆంధ్రులు తమ సంస్కృతము నెందు

లకోగాని అంత పరకు చేయరు. మిగిలిన వానిలో సుమారేడు అనువాదములు. సంస్కృతము నుండి చేసిన తెనిగింపులను దాసుగారు అచ్చ తెలుగుననే వెలయింతు రన్నది వారి శపథము. కాకున్న ఆదినుండి అనువాద సాహిత్యమున కలవాటు పడిన మనవారు కనీస మీ కృతుల నైన కాతరు చేయకుందురా ? ఆయా కారణములచే దాసుగారి సాహిత్యమునకు రావలసినంత పేరు ప్రతిష్ఠలు రాలేదు. కాని ఆ హరి కథలలో అపురూపమైన క్రమకపితాగానముకలదు. ఆ అచ్చతెలుగు కృతులలో వెనుకటి కృతులకంటెను వెక్కసమైన నియమ మున్నను అతిమాత్రమైనహృద్య మైన వైశద్య మున్నది. సర్వ పూర్వాంధ్ర ప్రౌఢ ప్రాబంధికుల గాఢపాక మగు సంస్కృతమునకు లేని చవి యున్నది. ఆ సంస్కృత కృతులలో కింకుర్వాణ గీర్వాణములైన ప్రయోగవిశేషములు గలవు. కాళిదాస కళాకౌశలము గలదు. కాదంబరీ స్వాదుత్వము గలదు, పండిత శుండాలముల శ్లాఘా శిరః కంప సమర్థ సామగ్రి గలదు. ఆ యనువాదములు మూలము మాలిమిని దక్కగొన్న వయ్యు స్వతంత్ర కృతి ప్రతిపత్తిని గల్గినట్లు కౌశల పేశలములై యున్నవి.

## కవిత్వపరమార్థము

ఇక కవితానుశీలన మించుక: శ్రావ్యమైన శబ్దముద్వారా రమ్యమైన అర్థమును హృద్యమైన అనుభూతిగా పరిణమింప జేయునది కవిత్వమని నే నెరిగిన సర్వ నిర్వచనముల సారాంశము. శ్రావ్యమైన శబ్దము అనగా అనురూప శబ్దజాల పునః పునరావృత్తి యని కాదు. లేక కొందరనుకొనునట్లు ఉచ్చారణ సులభములై వర్మ శ్రవః పేయములైన వనియుగాదు. సందర్భ సుందరములై, తదర్థశక్తి సందీపకములై ధ్వనిచే స్ఫురణకరణ పటువులై వీనులున్న మది కించునట్టివి. రమ్యమైన అర్థ మనగా రాకేందు రేఖకాదు, రాజీవ రాజికాదు, రజనీ ప్రియసఖము రమణీ మణీ ముఖము కాదు — కవి కనీనికాపనీత మైన, యొక నిష్ఠుర కుష్ఠరోగి కృమికుల సంకుల కులాయము కాయము, ఒక ముష్టివాని ముదనష్టపు మొగము కూడ రసజ్ఞజనమనోజ్ఞ ములే యగును. అలౌకిక లక్షణమైన రసానుభవ రహస్య మదే. హృదయమైన యను భూతి యనగా ఉషస్సుషమాసుభగమైన యొక శుభ సమయమున ఉపరితల మరు ణారుణ కుందలిత శిలామండలమై, శిఖరాంచలము సత్యోభ్యుదిత బాలభాను రోచి ర్వీచీ సముజ్జ్వలమై, హిమనిర్ఝరోప క్రమ రమణీయమై కన్పట్టు కాంచనగంగాశైల శృంగమును చూచినంత కలుగు సురుచిరానుభూతి కాదు. ఆ మహిమాలయమైన

హిమాలయ దృశ్యమున శశాంక శేఖరుని జటా విటంకము స్ఫురింపవలె. ప్రియ వల్లభముక్త సల్లలిత సంగీతము విన్నప్పుడు కాదు తదుపరి తదాయత్తక ఘటమున నున్నప్పుడు మనఃకర్ణ కుహరమున ఆ మధురస్మృతి మారెలుగిచ్చునప్పు డదీ యనుభూతి, వడసపెట్టి జిలేబీల నొక యద్దపేరు అరగించినప్పుడు కాదు అపూర్వ విపణిలో అద్దముల ముందు అందమైన పళ్లెరమునందు లేమగా పేర్చబడిన పలు పేటల కెంపుల దపుడుగళ్ళల వలె నున్న వానిని నోరూర కన్నార గాంచినప్పు డదీ గుండియ గుత్తకొన్న యనుభూతి. ఆయా వస్త్వింద్రియ సన్నికర్షము వలన అప్పటి కప్పు డేదో యొక లౌకికవాసనా వాసితమైన అనుభూతి ప్రతి పశువు, శిశువు, క్రిమి, కీటకము, **గూడ** పొందును. అనుభోక్త మానవుడే కానక్కర లేదు. సర్వ జ్ఞానేంద్రియములకును సాక్షిభూతమైనది మనస్సు. ఆ మనశ్శక్తి పండిన అదృష్ట వంతుడు మానవుడు. జన్మతః ప్రాప్త సంస్కారముతో, స్వయం కృషి ప్రలబ్ధ పరిణతితో, ఆలోచనాశీలమైన మనస్సుతో, నైక భావ వ్యక్తీకరణ శక్తివంతమైన వాక్కుతో, పశుప్రపంచము నుండి తన పార్థక్యమును సార్థకముగ నిరూపించుకొని ఏ విషయము నైన ఆత్మసాక్షికముగ అనుభవింప గలవాడు ఆవిష్కరింప గలవాడు మానవుడు. అందుచే అతడు పొందు అనుభూతి మందలో నొకడు పొందినట్లుండ గూడదు. మందిలో నొకడు పొందినట్లుండవలె. కేవల రుచిజీవి పశువు. అభిరుచి జీవి మానవుడు.

## దాసుగారి కవితాశయములు :

పూర్వోక్త నిర్వచన పరమార్థమునకు లక్ష్యభూతమైన కవితాపదార్థము కావలసినంత గలదు దాసుగారి కృతులలో. ముందు కవి యన్నను కవిత్వమన్నను ఆయనకున్న ఆశయము లెట్టివో పరిశీలింతము :

"కవి స్సాక్షాత్త్రయీ మూర్తిః కావ్య మేతచ్చరాచరమ్
న కశ్చి ద్వస్తుతో భేదః కార్యకారణయో స్తయోః"

అని వారి వక్కాణ (చూ. కచ్ఛపి—పుట 49), కావ్యము లోక మంతటిని లోఁగొనగలదనియు, కవి వేదమూర్తియైన భగవంతుని వంటి వాడనియు, అనగా అత డొక మహాస్రష్టయనియు, కవికిని కావ్యమునకును గల యనుబంధ మవినాభావ మనియు, అనగా కావ్యమతని అంతరంగ సంతాన మనియు భావము. అంతటి ఆకాశములో లోకబాంధవు డనిపించుకొన్న వాడెట్లు ఏకైక వ్యక్తిగా

రాజిల్లుచున్నాడో అట్టి లోకములో ప్రతిభావంతుడైన కవి యొక్కడే పరమ విశిష్టుడుగా పరిగణింపదగినవాడనియు, చతుర్విధ పురుషార్థములకును కావ్యమే ఏకైక సాధనమనియు సంగీతము పుష్పమైతే సాహిత్యము తత్పరాగ మనియు, ఆ రసికతయే ఫలమనియు. కైవల్యమే తద్రస మనియు, దాసుగారి యభిప్రాయము (చూ. పుట 49). మరియొకచో ఆయన సత్కవి యొక్క ఆంతర్యము నిట్లు సంభావించిరి-అతడు సర్వశాస్త్రుడు. సర్వభూతమయుడు, పరవశ సుఖయోగుడు, చిత్ర సంకల్ప భోగుడు. దైవాధీన మనః ప్రవృత్తి గలవాడు గాక స్వతంత్ర రచనానిపుణుడు, దయార్ద్ర చిత్తుడు. సత్య నిష్ఠుడు, కళాచణుడు అని (చూ. పుట 79). కవి యన్నను, కావ్య మన్నను ఇంతటి సముదాత్త భావన చేసిన అంతర్వాణి లరుదు. సత్కవి లక్షణము లన్నియు ఆయన తనలోనికి తాను తొంగి చూచుకొని చేసిన నిర్దేశములే యని ఆయన నెరిగిన వారందరు గ్రహింపగలరు. సత్కవి తన కావ్య దర్పణమున సర్వపదార్థములను విశకలితముగా ప్రతిఫలింప జేయగలడు. అతని వలె లోక కల్యాణ కరణ మన్యుల కసాధ్యము. ఎంత ప్రతిభను ప్రదర్శించి శైలీ లాలిత్యము జాలువార ఎంత రసవంతముగా చెప్పినను"తారాశశాంకము"వంటి కావ్య మసత్కావ్యమే యగుననియు వారి ఆశయము (చూ. పుట 50). ఆశయముకాదు ఆచరణము. తమ పలుకృతులలో వర్ణనల రూపముగను, ఉపమాద్యలంకారముల రూపముగను, విషయగతముగా తగిన సందర్భములు వచ్చినపుడు సరేసరి, ఎన్ని లౌకిక విషయాలను వాని ప్రాణస్పందములను బట్టి పరిశీలించిరో చెప్పలేను. తమ హరికథాదిక కృతులలో భక్తిసుధలను సూక్తి సుధలను నిక్షేపించుట కాదు. దేశమంతయు తిరిగి తిరిగి, ఊరూర, వాడవాడల, హరికథా కాలక్షేపములు చేయుచు, నవము నవము సందర్భములు కల్పించుకొని భగవద్భక్తిని, దేశభక్తిని, సమాజ విమర్శను, భారతీయ భవ్యధర్మమును తన జన్మ కర్తవ్యముగ భావించి ప్రచారము చేసినారు దాసుగారు. 8-3-1933 న విశాఖపట్టణమున జరిగిన యొక మహాసభలో "శృంగార సర్వజ్ఞ" బిరుద ప్రదానమున కర్హులైన దాసుగారు తమ కృతులందు పరిమిత శృంగారమును సముచితముగ పోషించుటయేగాని తారాశశాంకకారుని వలె నెక్కుడను ఇంచుకంత మేర మీరిన వారు గారు.

## సహజకవితాశాలి :

"సహజ కవిత్వశాలి"ని నిర్వచించి చెప్పుచు వారు - ఏ వేడబములు లేక కావ్య దోషముల నుజ్జగించి ఆనందోపదేశములు జనానీకమునకు కలుగునట్లు జగద్ధితముగ

కవిత చెప్పుదనిరి. "వింతవలెఁ బ్రాఁత సంగతి నెల్ల దించు" ననిరి (పుట ౮౦). దాసుగా రెక్కువగా చెప్పినవి ప్రాఁతకథలే. కాని ఆ చెప్పుటలో ప్రతి ప్రత్న కథ యందు నొక నూత్న పరిష్కారమును జూపిరి. అసలు కవితలో నున్న రహస్యమే అది :

"దృష్ట పూర్వా అపిహ్యర్థాః కావ్యే రస పరిగ్రహాత్
సర్వే నవా ఇవా భాంతి । మధుమాస ఇవ ద్రుమాః

అవి ఆలంకారిక వచనము. సహజకవిత్వశాలి యనుటలో వారి యుద్దేశము Poet by temperament – అనగా "I am a poet inspite of myself" అని వక్కాణించిన బైరను మహాకవి వంటి వాడని. అసలాయనయే ఆ సహజ కవిత్వ శాలి. ఏ విద్యా విషయమునకు గురువు లేనట్లే ఆయనకు కవితా గురువులును లేరు. ఆయన కళలకు భగవంతుడే గురువు, విజ్ఞతకు లోకమే గురువు, కవితకు హృదయమే గురువు. సహజ కవిత్వ మనగా నెట్లుండ వలెనో దాసుగా రెంత చక్కగా చెప్పిరో చూడుడు;

గీ॥ సాగి కమ్మెచ్చునన్ వచ్చు తీఁగ కరణి
సాలె పురుగు కడుపులోని నూలు వలెను
దబ్బునన్ దొర్లి పడు కొండదార మాడ్కి
సహజ కవిత బయల్వెడి సన్నుతిఁగను. (పుట 49)

ఆ యుపమ లనుపమములు. సత్య ప్రత్యయ స్థాపనాచార్యకములు. ఎట పట్టి చూచి నను ఆయక కవిత్వ మలవోక చెప్పినట్లుండును. సహజత్వ ముట్టి పడుచుండును. వ్యాసపీఠముపజ్జ బాసికపట్టు వేసికొని గంటముతో కవితాకలకంఠికి గండక త్తెర వేయునట్లుండదు. స్నానశాలలో జలయంత్రపు తుంతుర్వని మేన త్రుళ్లిన లాడి నంత బయల్వెడలు కూనరాగము వలెనుండును. బహుజన్మాంతర సాంద్ర సంస్కార బలమున ఆయన అలవోకగా చేసిన అధరస్పందము లందును మధురిమలు తొణికిస లాడుచుండును. ఆ పద్యము, లా పదము, లా కూర్పు, లా యూహలు ఫ్లాస్కునుండి కప్పులోపోసిన కాఫీ ద్రవనవోష్ణతవలె సద్యః స్వాద్యముగానుండును. సహజకవి – "బ్రతుకున సుంకం బెఱుఁగక – స్వతంత్ర రాజ్యంబు సేయు ప్రభువు వలె'.... పతివ్రతవలె సత్యవ్రతి వలె నిత్యసంతోషియని యెకచో వాక్రుచ్చిరి

(పుట 59). అంత సహజకవిత్వశాలి కనుకనే ఆయన అంత సర్వతంత్ర స్వతంత్రు డాయెను.

"ఏంటకో పెద్దలు పడిక ల్లేర్పఱిచిరి
యాట పాటలు గొల్వాన కనువగునటు
తెల్లముగ నున్న నలిగిన తెన్ను మాని
త్రొక్కఁబెడత్రోవ నా వంటి నిక్కుఁబోతు" (పుట 48)

అది పెద్దలు నడచిన క్షుణ్ణ మార్గమైనను తన కంత పడదని గడుసుగా సూచించిరి. "మురారే స్తృతీయః పంథాః" అన్నట్టిది. అయితే మురారి గుడుపుల క్లిష్టుడు. కవితా జీవాతువులైన కావ్య హేతువులలో ప్రతిభ గరీయసి. అది కవితకు ప్రాణ సారము. ప్రతిభా సహకృతమైన సృష్టి నిత్య ప్రత్యగ్రము. ఎప్పటికప్పుడేదో యొక నవ్యాసిస్పృక్ష తత్స్వభావ జీవలక్షణము. అందుచే దాసుగారివలె ప్రతిభా సమగ్రుడైన కవి పూర్వకవి ప్రౌఢ మార్గములు తన కెంత నచ్చియున్నను తన పంథ తా నేర్పడుచుకొనును. జీవితమున మహాజన మార్గానుసరణ మవశ్య ముపాదేయమే గాని సాహిత్యమున ప్రతికవియు ఎవరి దారి వారు చూచుకొనుటయే మంచిది. ప్రతిభావంతులైన ప్రాచీన మహాకవు లందరు చేసినపని యదియే. లేకున్న కవిజగత్తున వారికొక వ్యక్తిత్వమే లేదు. విశిష్ట ప్రసక్తి యుండదు. దాసుగారి యూహ యదే.

## ప్రాచీనకవి ప్రతిపత్తి :

అయితే తృణీకృత బ్రహ్మపురందరుడైన ఆయన దుర్విదగ్ధులగు ప్రతిస్పర్ధులకొక పెడసరపు క్రొరువలె గన్పింతురు గాని హద్దుమీరిన యహంకారము గాదు వారిది. ప్రాచీనుల మీదను పెద్దల మీదను గౌరవములేని గర్విష్ఠులుకారు. తన "జగజ్జోతి"కి తాను వ్రాసికొన్న పద్య పీఠికలో—

"కావ్య రచనకు వాల్మీకి కావలయును
తగును వ్యాసుఁ డొకండె శాస్త్రంబుఁ దెలుప
శక్తి లేమి నెఱిఁగియు లజ్జనొఱంగి
వేత్తవలె నటియించెద విధి వశమున."

అనియు ఈ 'కచ్ఛపి' 50 వ పుటలో—

"కాళిదాసుని రఘువంశ కావ్యముఁ గనుఁ
గొనియు, భవభూతి నాటకమును జదివియు
బాణు గద్యమరసియుఁ గవనము జెప్ప
వెఱవఁ దద్దిర నా వంటి వెఱ్ఱివాఁడు"

అనియు తన వినీతిని మనస్వాను వినిస్స్రుత మధురాభిరుచి స్రవంతిగ ప్రకటించు కొనిరి. ఇంకను పలుకృతుల పలుతావుల వారి కవితాభిరుచులు కొన్ని ప్రకటితము లైనవి. ప్రహ్లాద చరిత్ర పీఠికలో —

"పూర్వ కవు లందరున్ గడు పూజ్యు లందు
భాగవతు లయి గోస్తనీ పాకముగను
గృతు లొనర్చు నధికుల సంస్కృతమున జయ
దేవుఁ దెనుఁగునఁ బోతనం దెలిసి యెంతు"

నని చెప్పుకొనిరి. మరికొన్ని తావులగూడ వీరిరువురను ప్రశంసించిరి. దాసుగారికి వీరిపై నేదో ప్రత్యేకమైన మక్కువ యున్నదన్నమాట. దానికింకేమి కారణమై యుండును ? ఆ యిరువురు నీయన వలెనే జీవనమునను, కవనమునను పరమ భాగవతులు, ద్రాక్షాపాక రిరంసువులు. అంతేగాక కడు పిన్నటనుండియు పోతన భాగవత మీయనకు భావగతము. పంచవర్ష దేశీయమైన ప్రాయమున భాగవత పఠన ప్రావీణ్యమునకు బహుమతి నందిరి. ఉపరి పోతనయు నీయనయు సహజ పాండిత్యధురీణులు, అంత్యప్రాస ప్రవణులు, ప్రవీణులు. జయదేవుఁడు నీయనయు మధుర సంగీత మధితాంతరంగులు. వెరసి మువ్వురును పరమభావుక పట్టభద్రులు, ఈయన కించునట్టి మరియొక జగదేక మహాకవి గలఁడు. "షేక్స్పియరుని వంటి కవి న భూతో న భవిష్యతి" అనియు, "తన కావ్య దర్పణంబున జగము నెల్లఁ జూపిన మహానుభావుఁడు భారతీయులలో వ్యాసుఁడు, ఆంగ్లేయులలో షేక్స్పియరని నా యభిప్రాయము" అనియు తన 'నవరస తరంగిణి' పీఠికలో ఢంకా బజాయించి చెప్పిరి. కాళిదాసు కంటెను షేక్స్పియరు నధికునిగా సంభావించిరి. దానికి కారణము షేక్స్పియరు కవి"జగచ్చక్షు వగుటయేకాదు_ "షేక్స్పియరుతు సహజ పండితుఁడు స్వతంత్ర కల్పనా చతురుఁడు, పరుల కట్టుపాట్లకు లొంగక యథేచ్ఛగాఁ గావ్యంబు

లొనర్చెను. మఱియుం దెన్గు శబ్దంబులను నిజేచ్ఛానుసారార్థంబుల వినియోగించెను. కాళిదాసుఁడు ప్రాచీన నిబంధనములకు లోఁబడి కృతు లొనర్చె." (చూ. శ్రీ నారాయణదాస వ్యాసక్షీరము – పుట 163). ఈయన కచ్చివచ్చిన గుణములే షేక్స్పియరులో నున్నవి. అందులకే ఈయన కంత నచ్చినాఁ డాయన.

## సదసత్కావ్యవివేచనము :

ఆ షేక్స్పియర్కాళిదాసుల రసపోషణ విషయమై తాము రచించిన బృహద్గ్రంథము 'నవరస తరంగిణి' పీఠికలో సదసత్కావ్యముల గురించి తెల్పుచు దాసుగారు – "మనసున కింపగు శబ్దార్థ సమూహము కావ్య మనఁదగినది. జనుల కే శబ్దార్థసమూహమువలన మనసున కుల్లాసము గలిగి సత్కార్యాచరణమున నుత్సాహము కల్గునో యట్టిది సత్కావ్యము. జనులకు భయ శోక జుగుప్సా క్రోధ ములఁ బుట్టించి దుర్మార్గమునకుఁ బురికొల్పునది యసత్కావ్యము." అనియు, అందులోనే కవిత్వ ముఖ్యలక్షణమును, ప్రయోజనమును విశదీకరించుచు, "రసము చెడనీయక యమకశ్లేషిగ చెప్పుట, సందర్భశుద్ధి గల పదప్రయోగము, స్వతంత్ర ముగ కథను గల్పించి యపూర్వ మగు నూహం దెల్పుట, అతుకుంచక పద్యము లల్లుట. పండిత పామర రంజకముగ మృదుమధురోచిత శబ్దంబుల న్పొందు పఱచుటయు కవిత్వమున ముఖ్యాంశములు. సర్వసాధారణానుభవమును యథోచితం బుగఁ దెల్పి జనుల హృదయంబుల కెల్ల రస ముప్పతిల్లంజేసి నీతి న్బోధించుటయే కవితకుండగు ప్రయోజనము" అని యుద్ఘాటించిరి. వేరొకచో – "ఖ్యాతిమీర మంచి కావ్యమున్ విరచించి కవి తాను తరించి లోకమున్ దరింపించు" ననిరి. తమ ప్రహ్లాదచరిత్ర పీఠికలో – అంధప్రాయమైన పూర్వ ప్రబంధానుకరణమును గర్హించిరి. ప్రౌఢకల్పనల పేర అనుసృతమగుక్లిష్టభావనా మార్గమును నిరసించిరి అప్రసిద్ధములు, అప్రయుక్తములు నగు పదముల ప్రయోగము నీసడించిరి. వైశద్య మనుపేర పేలవత్వము ప్రదర్శించుటను తెగడిరి. (చూ. కచ్ఛపి – పుట – 13). లోకపు మానిసులలో తలచినట్లు చెప్పువారును, చెప్పినట్లు చేయువారును మిక్కిలి యరుదు. ఆ యరుదైన వారిలో మిగుల నరుదైనవారు భావితాంతఃకరణ శిరోమణి దాసుగారు. ఆయన ప్రకటించిన కవితాశయము లెల్ల ఆయనకవిత కవశ్యము చెల్లును.

౭.క మధురాశయము :

తమ దైన మరియొక మధురాశయమునే భంగ్యంతరముగ సౌందర్యనాటకమున నిట్లు సూచించిరి.

సీ॥ చిఱుతాలపై జిలజిలఁబాఱు సెలయేటి
నీటిపై అలముకి దాఁటు జూచి
నానాట సరివాటు బూని పిల్లనఁ జేర
వచ్చు జింకల కూర్మి పాటు జూచి
మగఁటులఁ జెలలాడి జెడిపడ్డ బొట్టులఁ
బొలియించు నేనుఁగు పోటు జూచి
దువ్వి ముద్దుగొనుచు దొడ్డ్యాలుల తోడ
నాటాడు చెంచెత నీటు జూచి

వర్ణనము సేయుచున్ భూరి వనములందుఁ
బలుకకంబుల పిట్టల పలుకులకును
స్వరము గట్టుచుఁ జెట్టుల పట్టులందు
పద్యములు వ్రాయు భాగ్యంబు పట్టు నెపుడు ?"

అసలు దాసుగారి వింత నిసర్గ మధుర ప్రకృతిని, బహుళ కళా సురభికామ్యుని జేసినది వారి యభిజన మజ్జాడ నావరించిన సువర్ణముఖీ సజీవ స్రోతస్వినీ పరమ రమణీయ పరిసర ప్రకృతి. ప్రకృతిసవిత్రిని రసప్రవాహ్యగా భావించిన ఆ మహానుభావుడా తరంగిణీ సముత్తుంగ తరంగముల గములగలగలలలో ప్రసిద్ధ వాసర నికుంజ కికీదివి సంకుల కింకిరాత సమాదకళా హాహాహూ కరిత లలిత కల కూజితములలో వినిపించిన సంగీత సరస్వతి కచ్ఛపీ ప్రభసలను, కనిపించిన కవితా సరస్వతీ దరహాసములను తన కళాభిరుచి వికాసమునకు సంచకరువుగా గ్రహించెను.

# దాసకవితాదర్శనము

## కవిత్వ మహత్వము :

దాసుగారి నిర్యాణానంతరము 2౬-1-1945 తేది ఆంధ్రపత్రికలో శ్రీచెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు "గానమునందు వలెనే కవిత్వమందుగూడ శ్రీదాసుగారికి విశిష్ట స్థాన మీయక తప్పదు" అని వక్కాణించి యుండిరి. ఆ వైశిష్ట్య మెట్టిదియో యథావకాశముగా పరిశీలింతము. ఏ కవికైనను అతని సాహితీసర్గమునకు ప్రధానము లైన యుపాధులునాలుగు; ఊహాశాలిత (Imagination), అనుశీలనము (Observation), విషయజ్ఞత (Information), అనుభవము (Experience). కవి సామాన్యుడైతే అత డే విషయము నే యుపాధి నాశ్రయించి ఆవిష్కరించుచున్నాడో తెలిపోవును. అదే మహాకవియైతే అతడు సర్వమును అనుభూతి సాక్షికముగనే ఆవిష్కరించినట్లుండును. అయితే మహాకవియును సామాన్యకవివలె సంఘోప జీవియే. ఇరువురి అనుభవ పరిణామమునకు నొక అవధియుండును. అతడెంత మహాకవియైనను తత్కాలవ్యగత సర్వవిషయములు నతని అనుభూతి పరిధిలోనివేయై యుండుట కవకాశములేదు. కాని యతడు ప్రతివిషయమును తన ప్రతిభాప్రకర్షమున మనశ్చక్షువు ముందు సాక్షాత్కరింపజేసికొని, అంతస్సన్నిధి చేసికొని తా ననుభవించినట్లుగనే ఆవిష్కరించును. అందులకే సామాన్య కవులవాక్కులు చెవికెక్కవు, మదికింపవు. అందు పేలవత్వమే గాని మార్దవముండదు. కాఠిన్యమే గాని మసృణత్వముండదు. మహాకవుల వాక్కులు సద్యోహృద్యములు, సహృదయ నైవేద్యములు, శక్తిమంతములు. అర్థగంభీరములు, చిరస్మరణీయములు. లోకమున శృంగారమును పోషించిన కవులెందరు లేరు ? అందులో నెందరు కాళిదాస భట్టబాణ జయదేవామరుకుల చాయలకు రాగలరు ? అట్టి మహాకవులును కాక, వట్టి సామాన్యులునుగాక మధ్యస్థముగా మరియొక కోవ కవులుగలరు – విదగ్ధమాత్రులు. తరచు మన మెప్పులకు పాత్రులైన కవులలో ముఖ్యులు ముమ్మీసము వీరే. సామాన్యకవుల చేతిలో ఇత్తడి ఇత్తడియే, పుత్తడి పుత్తడియే; పిండలి పిండలియే పిప్పి పిప్పియే. అదే విదగ్ధుని చేతిలో నయితే నిరాకార కనకశలాక నిపుణతమై నగిషీలు చెక్కుకొనును, నగల రూపము ధరించును. మహాకవి చేతిలో ఇత్తడి గూడ పుత్తడియగును. ఇదేభేదము. ఆకోవకు జెందిన మహాకవులలో కోటికి పడగెత్తిన వాడు నారాయణదాసు. ఏమందురా ?—

తరువోజ॥ తొల్లింటి వారు వదువుకొను పెల్లి
తోడివారలకుఁ జెంద్రోవ జూపుటకు,
మళ్ళి పుట్టెడు తెవుల్ మాన్పించు మందు
మందిచ్చి నిచ్చలుం బ్రతికింపు కొఱకు. (కష్టఫలి—పుట 49)

భారతీయుడైన మహాకవియే అనగలడీ మాట.

"ధరణిం జీఁకటివేళ దప్పు వెలుఁగున్ దర్శింప కందోయికి
న్మతి యే వస్తువులైనఁ దోఁచనటు నిన్ ధ్యానింపు నవ్వాని క
ద్దిర యీలోకవికారముల్ మఱి రవంతేనిం గనన్రావుగా
అరయంగాఁ దన జీవితంబున మహాత్మా! సూర్యనారాయణా!

(కష్టఫలి – పుట 58)

అమరున్ బంగరుసుంది దాని దగు చాయన్ వేఱు సేయంగ శ
క్యము కానట్టుల విశ్వగం బెడపరా దయ్యారె విన్పుంపె; చ
క్రమునం గోణము రీతి నారయఁగ నీత్రైలోక్య మేపారి నా
శము శ యందునఁ జెందుచుండు పరమేశా! సూర్యనారాయణా!

(కష్టఫలి – పుట 58)

ఆ ఊహలలో నున్నది మహత్త్వము, దాని నుచితోపమముగ విన్యసించుటలో నున్నది కవిత్వము.

ఏవంవిధ కవితాదర్శన మనోజ్ఞమైనది దాసుగారి బాటసారి. ఇది బహువారములు విశ్వవిద్యాలయ పట్టపరీక్షలకు పఠనీయమై ఒకతరము క్రిందట విశేషప్రచారమునందుండిన కావ్యరాజము. అవిద్యావరణములో అవతరించిన మానవజీవితము ప్రజ్ఞానసిద్ధివడసి సార్థకమగుట యిందలి వస్తుతత్త్వము. ఇది యొక గూఢవస్తుమయ కావ్యము. (Allegorical Poem). సంస్కృతమున నెప్పుడో భట్టోద్భటుడు కుమారసంభవమును గూఢవస్తుమయ కావ్యముగా దీర్చినాడు. కృష్ణమిశ్రుని 'ప్రబోధ చంద్రోదయము' వేదాంత దేశికుని 'సంకల్పసూర్యోదయము' నీతరగతికి చెందినవే. తెనుగున పింగళి సూరనగారి 'కళాపూర్ణోదయము', చల్లాసూరయగారి 'వివేకవిజయము',

పిరిసరింపఁగావలె 'అశ్వాగ్నివిద్వన్మహాసభ', "మహారణ్యపురాధిపత్యము", ఇటీవల వెలసిన వేప్రోలు (గుంటూరు జిల్లా) వాస్తవ్యులు శ్రీ శేషగిరిరాయల 'మహాకౌలీనము', మున్నగునవి కూడ అట్టి సాంకేతికరచనతో సాగినరచనలే. బాటసారియందు ప్రబోధ చంద్రోదయాదులందు వలె వేదాంత పరమైన యొక మహార్థ వివేచన మనోహరముగా సాగినది. విషయము స్వభావతః గహనమయ్యు రచన ప్రసాద గుణ ప్రధానమైనందున భావుకున కది యెల్ల కరబదరమైనది. దీని రచనా కాలము నాటి దాసుగారి వయసు పైలావచ్చేమి (౨౪–25 సం॥లు – క్రీ.శ. 1888) – పిన్న వయసునందే హృదయ పరిపాకము గల పెద్ద రచన చేసిరి.

ఇది స్వతంత్ర రచన. చిక్కని తెలుగు పలుకుబడిని చక్కని వచనము చేసిన రచన. తగిన మోతాదులో సందర్భసుందరములు, స్వకపోలకల్పితములునైన మనోజ్ఞపద్యములకు తావలమైన రచన. బాహిరమైన రచనయు, ఆంతరమైన భావనయు, అకృత్రిమము, నవేలివమునై సరళతయే సౌష్ఠవముగా నెగడిన బహిరంతర బంధురకృతి యిది. దాసుగారు మదరాసు, మైసూరు, హౌరా, హైదరాబాదు మున్నగు మహానగరములందు హరికథాకాలక్షేపములు సేయుచు నడుమ నడుమ బాటసారి పద్యములనుటంకించుచు తత్రత్యులైన అన్య భాషీయులకోస మలవోక వాని కాంగ్లానువాదము సేయుచుందు వారు. అందుకొందరి కోరకమేరకు తదుపర పరిపూర్ణమైన ఆంగ్లానువాదమునే వెలయించిరి. వారి జీవిత కాలము నందే బాటసారి పలుతడవలు ముద్రితమై సహృదయులచే బహుధా సంభావింపబడినది, సమీక్షింపబడినది. ఆ సమీక్షలలో, నా సంపాదకత్వమున గుంటూరు రచయితల సహకార సంఘము గతవత్సరము వెలయించిన "శ్రీ ఆదిభట్ల నారాయణదాస సారస్వత నీరాజనము" అను బృహద్గ్రంథమున పొందుపరుపబడిన, డాక్టర్ అమరేంద్ర, శ్రీ క్రొవ్విడి రామం, శ్రీ చెఱుకుపల్లి జమదగ్ని శర్మగారల సమీక్షలివి పరిమితియందు లఘువులయ్యు పరిణత ప్రసంగలఘువులు గాన వానిం జూడదగును.

వాల్తేరు
1–8–1976

యస్వీ జోగారావు

# AUTHOR'S
# PREFACE

THE story embodied in this book is an allegory of human life which begins in sheer ignorance and ends in perfect knowledge. In writing this small poetical work my main object had been to present to the Telugu reading public an attempt at something original as to plot, coupled with vividness of natural descriptions told in easy Telugu devoid of all the artificialities of the usual ornate style. This system, I venture to hope, would be acceptable to cultured readers whose tastes have been mellowed by the ever-advancing modern Literature of the West.

I beg to dedicate this humble book to the Hon'ble Rai Bahadur **P. ANANDA CHARLU**, Vidya Vinoda, B. L, C. I. E, F, M. U., one of the best friends of Telugu Literature, as a small token of my ever-lasting gratitude to him.

VIZIANAGARAM,
*1st June 1933*

A. NARAYANDAS,
*Principal,*
*Maharajah's Music College.*

# బాటసారికి గూఢార్థము

బాటసారి మాయాగర్భ నరకవిముక్తుఁడగుచుఁ బూర్వజన్మ వాసనజ్ఞాతిబాలుఁడై యెదిఁగినయాత్ముఁడు, దారసుతులు విద్యావివేకములు, మహాపత్తి సంసారము, ఓడన్బగిల్చిన కొండ పాపము, సూదికొండ ప్రకృతి, సప్తసముద్రపక్ష్యారణసీమలు జాగ్రత్స్వప్నసుషుప్తులు, ఏడంతరవు లేడుకొంగు లేపవడేనిమిది గదులుగల మొంటికంబము మేడ సప్తధాతువులు సప్తాహాయములు, అరిషడ్వర్గములు, పంచకోశములు, నాల్గు పురుషార్థములు, త్రిగుణవికారములు, ప్రవృత్తినివృత్తులు, బ్రహ్మపదవి, కింబురుషాఢి, రాజదంపతులు జ్ఞానవైరాగ్యములు, చెలికత్తెలష్టాంగములు, తొలిరాజధాని యైహికము, రెండవ రాజధాని యాముష్మికము, గంటకంబము కర్మము, ప్రాంత శాస్త్రము, నూత్న వధూవరులు భక్తిశ్రద్ధలు, వలపుజాబుపనిషత్తు, బాటసారికి స్వదార సుత పునస్సమావేశము కైవల్యప్రాప్తి, గుఱ్ఱము బుద్ధి, బాకుఁ తుపాకి బల్లెమీఁటెలు సాధనచతుష్టయసంపత్తులు, పులిపందులు రాగద్వేషములు. జాగిలములు వ్రతములు, ఆసవము దీక్ష. దాది సంప్రదాయము, గడియారమాయువు. ఉంగరము ప్రత్యభిజ్ఞానము, వనదేవతా ప్రసాదము, మామ గురుఁడు, బావ సఖుఁడు, విప్రభాష్యుఁడై బద్ధుఁడగుచుఁ బ్రబుద్ధుడై ముక్తుఁ డగుచుండ యాత్ముని సహజ క్రీడలని బాటసారికథనంతకును వేదాంతపరముగావర్ణమిట్లు వ్యాఖ్యము. ఈ బాటసారికథ స్వకల్పితముగాని యింకొక భాషాకావ్యమున కనువాద మెంత మాత్ర మున్నాదిందుఁదత్సమ తత్భవము లచ్చ తెలుఁగు వివరింప నలవికాని పదార్థ ప్రకటనమునకు మాత్రమే యించుమించుగాఁ గూర్చఁబడినవి. మొత్తముపైఁ దత్సమతద్భవము లడ్డదిడ్డముగాఁదఱుచు పద్యకావ్యముల న్గానిపి తేయని తేటతెలుఁగునాటు పలుకులస్వల్పప్రచురణవా రుభయ భాషల పర్యాప్తియు వర్ణ సాంకర్యపరులు సేవలింక మూఁడఁగాఁదగదు. ఈబాటసారిజ్ఞేన యాఁడుచుఁ బాడుచు నైలుఁగు వారలకు నే వినిపింప మొదలిడినపుడు నాయీడిరువదినాలుగేండ్లు.

ఆ॥ అనుచు సొమ్మసిల్లి - యతఁడెట్టకేలకు ।
దిమ్మదీఱ డెంద - ముమ్మలింప॥
అలసినట్టి యంగ - ములఁ గూడుకొని లేచి ।
నిలిచి నాల్గుదెసలు - కలయఁజూచి ॥ 6

క॥ కానీ దైవమ యిక్కడ ।
కా నను దెచ్చితివి యెట్టు - లౌ నీమీఁదన్ ।
పూని సయిరింతు నదుగోఁ ।
బై నెగడుచు తూర్పు - తెల్లవాఱుచునుండెన్ । 7

చ॥ అనుచ తఁడంతఁగాంచెఁ జటు - లానిలసంచల దూర్మిమాలికా ।
ఘనవికటధ్వని ప్రబల - కబ్ధిసముత్ప్లవమాన రమ్య నూ ।
తన రవిబింబ మొక్కదెసఁ - దక్కినచక్కులఁ బిక్కటిల్లియు ।
క్కున నడుమిన్న దన్ననొక - కొండనుదండను గాంచి వెండియున్॥

గీ॥ తోడరి యక్కొండనడుమ నె - క్కడనొ తొల్చు ।
కొనుచు వడిసైఁచలేక హో - రునఁబిఱుంది ।
కీడ్గిలన్బడుకొండల - నీడ్చుకొనుచు ।
నేపుమైఁద్రుళ్లిపడు సెల - యేఱుఁగనియె ॥ 9

గీ॥ కాంచి యతఁడట్టి క్రొత్తలో - కంబునందు ॥
నున్న తీరున నచ్చెరు - వొంది వేఱు ।
వంకఁ బోలేక యెద్దియు - న్బాలుపోక ।
తెంపుతోఁ దుదకాయేటి - తెన్నువట్టె ॥ 10

సీ॥ ఆయేటి కిరువంక - లం దేటవాలుగ -
మెట్ల మర్చినయట్లు - మీఁటినెఱియఁ ।
బడినమామిళ్ళు - పనసలు నిమ్మలు -
నేరేళ్ళు మఱివింత - తీరుచెట్లు ।

గీ॥ కదలినవ్వుచుఁ బొంగి సందడు లోనఁ జేరఁ।
గప్పురపు దివ్వెవలెఁ జంద్రు - డొప్పమీఱె।
గొండయంతయు మెండుగ - వెండివాఱెఁ।
బండువెన్నెల కన్నుల - పండువయ్యె॥ 14

ఉ॥ అంత నతండు కన్నులకు - హాయిగ వెన్నెల గాయఁగాంచి తా।
నంతయు సంతసించి పర - మేశుని పైఁ దనభారముంచి ని।
శ్చింతఁ జనంగనెంచి యటు - చెంగట న్వరికించి దారి యొ।
క్కింతయుఁ దప్పిపోక సెల - యేటిదరిన్బడి యేఁగుచుండఁగన్॥ 15

గీ॥ పులుఁగు మూల్గులు బెబ్బులి - బొబ్బరింత।
లడవినందంద నెమ్మది - కడలుగొల్ప।
తడఁబడుచతండు నడిరేయి - దాఁక నడిచి।
దారికడ్డుగ నొకకొండ - తగులఁజూచి॥ 16

చ॥ ఇదియొక్క సూదికొండ తెలి-వియఁక యీసెలయేఱు దీనిలో।
పు దొలిచి వచ్చుచున్నయది - పోవఁగ నాకిటమీఁద దారియె।
య్యదిచటఁ బ్రొద్దుదూఱువఱ-కాఁగెద నంచొక చాపరాయి వె।
న్గదియఁగ మోపి మింటిదెస - గన్గొనుచు న్దలపోసె నిట్టులన్॥ 17

గీ॥ వెల్లబాఱిన జాబిల్లి - వేగుఁజుక్క।
యును దివంబున వెలయుచు - నున్నయట్లు।
చిన్నికొమరునితో ముద్దు - చెలియ తేలు।
చుండెఁగాబోలు మున్నీట - నిండుదొఱఁగి॥ 18

ఉ॥ ఎక్కడి నావయాత్ర లభి - యించె నహో మనపాల దిక్కులే।
కక్కట నిన్ను బాసి చెలి - యా యిటులొంటిగనుంట వ్రాసెనే।
మ్రుక్కడి దయ్యమింతపని - పుట్టునటంచు నెఱుంగనైతినే।
చక్కని నిన్నువంటి సతి - జన్మశతంబులనైనఁ గల్గునే॥ 19

క॥ అని బిట్టు సొమ్మసిలి నె।
ట్టనఁదెల్విన్బొందె యంత - ట జ్జేగుఱు పూ।
సినలాగు ప్రొద్దుపొడుమఁగఁ।
గనుఁగవ సెరొత్తుకొంచుఁ గనుఁ - గొనిపిలుచన్॥ 20

గీ॥ ఔర గారడిసూర్యుండ - యబ్బురంబు।
కద బ్రతుకువలె నీకర కౌశలంబు;
అల్పభౌమంబులన్జూపి - యధికదివ్య।
ములను గన్పట్టనీయక - మోసవుచ్చు।

క॥ అనియిట్లు బ్రతుకుపై రోఁ।
తను బట్టి యసూయవుట్టఁ దనకత్తుల ని।
చ్చిన లోకబాంధవుం డన।
క నిష్ఠురములాడి యతఁడు - గమనోన్ముఖుఁడై॥ 22

క॥ పరికించి కొండయావల।
కరిగెడు నొకలోయదారి - నారసి యందున్।
జొరఁబడుచు నెట్టకేలకుఁ।
జెరువొక్కటిగాంచి దాని - చెలువున్బొగడెన్॥ 23

సీ॥ చుట్టున గట్టులు - పెట్టినయట్టులు -
బలు కొండల నెవండు - నిలిపినాఁడు।
నీటిమట్టముదాఁక - నాటిన లట్టుల -
వృక్షపఙ్క్తు లెవండు - పెంచినాఁడు।
కనుచూపు దూరంబు - గాఁ జదరముగ నెం -
తయు లోఁతుగ నెవండు - త్రవ్వినాఁడు।
పలువన్నియల తామ - రలు కలువలు వర్సఁ -
బూల నారెవ్వఁడు - పోసినాఁడు।

సృష్టివైచిత్ర్య మహహా యూ - హింపఁ దరము ।
యే మనుష్యులచేత కీ - యింపవచ్చు ।
నేను చూచిన పెలయేఱు - దీనిలోనఁ ।
దొడరికాఁబోలు నికొండఁ - దొలిచిపడియె ॥ 24

క॥ ఇటులబ్బురపడి యతఁడా ।
తటాకమున స్నానమాడి - తపసున్నని మా ।
ఱుటకై పొక్కుచు నంజలి ।
పుటమ్ముతో నీరుపట్టి - పొగడఁదొడఁగెన్ ॥ 25

గీ॥ అడలుగొలిపెడు చీఁకటి - కడలినుండి ।
కడపి మముఁగాచు తరణి! నీ - కిదె ద్రమొక్కు ।
అహితములఁ గొట్టి గొప్పమే - ళ్ళాచరించి ।
యేలుచుండెడు మిత్ర! నీ - కిదె జొహారు ॥ 26

క॥ అనుచర్ఘ్య మొసఁగి కొండ్రఁ ।
దినఁదగు దుంపలు కొన్ని - తీసి నమలి తే ।
యని నీరుత్రాగి బలుకా ।
ననీడకు నడగి యతఁడు - కూర్చున్నతఱిన్ ॥ 27

చ॥ గిరులదరంగ నొక్క మొగి - గీఁకరొదల్చెలరేఁగ నంతట ।
ధరణి వడంకునట్టులఁ ఖ - దంబుల చప్పుడుతోఁచెఁ బిమ్మటన్ ।
గరములఁబట్టి చెట్టును పె - కల్చుచు పీనులవీచుకొంచు న ?
త్వరముగగొండలీనిక వి - ధంబున నేన్గులు చెర్చుచేరఁగన్ ॥ 28

గీ॥ తమ్ముమాలిన ధర్త్రంబు - తెగఁజటంచుఁ ।
దలల నలరించు లిమ మొద - ళ్ళులను గావఁ ।
బూని చాచిన నీడల - ముసుంచుకొనియొ ।
బాదపంబులు నడిమింట - భానుఁడొప్పె ॥ 29

లమ్ముతానంపములు పెన - యన్న నతండు !
గనుచుం గలయందు విహరించు - కరణిం జనుచు !
ఒంటిపాటునకై వగ - పొంది యంత!
లోనం దన చెలిం దలంచి యి - ట్లు పలవించె॥

సీ॥ పింఛియంబుల విప్పి - పెండ్లియాటల రొప్పి -
యాడు నట్టువపిట్ట - జోడుం జూచి ।
తనమిఠారికిడంబు - తలిరుటాకువిడెంబు -
వాడుకోయిలమిన్న - దాడిం జూచి॥
పడంతితోడుత నచ్చ - పండు గుజురు ముచ్చ -
టాడుచుం దినుచిల్క - ప్రోడం జూచి ।
కమ్మ తేనెల మెక్కి - కొమ్మ కౌంగిటం జొక్కి -
పాడుతేం దుమ్మెద - కోడెం జూచి ॥

అంత గంతుల హెచ్చి ర - వంత నొచ్చి ॥
నేర్పరియనుచు మెచ్చి ని - ట్టూర్పువుచ్చి ॥
బయలు కౌంగిళులకుం జొచ్చి - హాయులు విచ్చి ॥
నచ్చి పొగులుచునుంటిం జా - న యిటువచ్చి 35

గీ॥ ఇన్ని సోద్దెముల న్జూచి - యోంగుచుంటి ।
మనసునకు నిచ్చతగులదు - మతి యదేమొ ।
కాని తలంపున మెలంగు - చక్కని వెలంది ॥
బిడ్డలన్బాసి యుంట కీ - యడ్డులేమొ ॥ 36

గీ॥ అనుచు వలవంతం దూలుచు - నతండు రేయి ।
వడినవేళకు నాదివ్య - భవనమునకు ।
వచ్చి యాలోనికి న్జొచ్చి - యచ్చెరువుగ ।
నచటి వింతలుగని యిటు - లబ్రబడియె॥ 37

సీ॥ కమలాకృతియుఁ జుట్టు - కైవార మరకోసు -
గలిగి యేడంతస్థు-ములఁ జెలంగి।
మొదటిదా నంకణమున - కేను రెండు నా-
పయి దాని కాతేట్లు - వరుసతోడ।
నొక్కొ-క్క-టియె తగ్గి - యుండె గదుల లెక్క -
తనరు నంతరవు నం - తరువు క్రింద।
నొక్కొ-క్క బలుకంబ - మూఁతముగా నిలు -
వున కొండువన్నియ - పొల్పుమీఱు।

ధాన్యరాశులకుఁ దొలియం - తస్తు నీటి।
యంత్రముల కవ్వలిదియు మూఁ - డవది వంట।
కావలది యారగింపుల - కైదవయది।
సభకు నా పైది శయ్యా క-ర్చనకుఁదుదది॥ 38

శా॥ ఔరా యేమి మహాద్భుతంబిది నిజం-బా? చిత్తవిభ్రాన్తియా?
యేకీ యెవ్వరు గానరారిచట నూ-హింపన్న [illegible]ంబు కా।
దే రాజ్యంబుననంటినో యెవరిదో-యీ సౌధరాజంబు నా।
నారత్నాంచితమై తనుంబుడిపి యా-నందంబు గావించెడిన్॥ 39

గీ॥ అన్నియంతస్తులందు న - నతుకు లేక।
వెలయు రతనాలు బలుకంబు - ములుగ దూల।
ములుగ గోడలుగాఁ దిన్ని - యలుగ బళిర।
యిట్టి వింతలు చూతెయునెం - దేనిఁగలవె॥ 40

క॥ ఎచ్చోటనుండి చూచిన।
నచ్చెరువుగ మేడయెల్ల - నగపడెడుఁగదా।
యచ్చపురతనంబగుటం।
బెచ్చుగ నిదియిట్లు మాఱు - మెఱయుచునుండెన్॥ 41

కం॥ అవురా 'కిఞ్చిద్భోగో।
భవిష్యతి' యను సూక్తి నిచట - స్పష్టంబయ్యెన్।
దివిజేశ్వరునకైన నీ।
భవనోన్నతిఁ బొందనెట్లు - ప్రాప్తంబౌనో॥ 42

మ॥ నరులా? కానిమేష భావమిచటన్ - గాన్పించుట న్వేల్పులా।
దురు నన్నెవ్వరు పల్కరించ రిది యెం-దో మాయఁ గాఁబోలు బా।
పురె యిచ్చోటను బెల్లఁ జేయుటకుఁ గీ - ల్బొమ్మల్గడంగన్బరిం।
బారిఁ గాలోచితరాగతాళములనన్ - మోదంబుఁ గావించుచున్॥43

గీ॥ అనుచుఁ దుదిమిద్దెపైనుండి - యాతఁడు మఱి।
యాఁడుబొమ్మలవింతలు - నరయుచుండ।
గొంతలోపల గంట కం - గుమని మ్రోఁగె।
వెంటనే మేడలో వింత - వెలుఁగు తోఁచె॥ 44

గీ॥ చుట్టు చెలువలు గొలువంగ సొంపుతోడఁ।
జెలఁగు తనముద్దుకోమలి - చెట్టఁబట్టి।
చుక్కలందున రోహిణి - ప్రక్కనొప్ప।
చందురునివలె నొకపాదు - సాహి తోఁచె॥ 45

కం॥ అద్దివ్యపురుషుఁడత్తఱి।
సుద్దిసలకింబులాడి - జోటులకొల్వన్।
ముద్దియచేతిన్గొని తెంచె।
మిద్దెకుఁజని వేల్పుబత్తి - మించి నుతించెన్॥ 46

ఉ॥ "కారణకారణాఖిల జ-గత్పరిపాలక విశ్వరూప సం।
సార విదూర ఘోరకలు - షఘ్న దయాంబుధి సర్వజీవనా।
ధార యశోవిహార విబు-ధస్తవనీయ చరిత్రభక్తను।
న్ధారనమోఽస్తుతే" యనుచుఁ-దత్పరుఁడై యతఁడంతదిగ్గునన్॥47

గీ॥ పలుకులెవ్వియులేక భ్రమా - న్వడినవాని।
నార్తిమూర్తీభవించిన - యట్టులున్న।
దిస్సమొలవాని మిక్కిలి - డస్సియున్న।
బాటసారిని గన్గొని - పలికెనిట్లు॥ 48

మత్తకోకిల॥ ఔర యెవ్వడవీవు నివ్వాక-సంద కెంతయు మిద్దనే।
తీరున న్జారఁగల్గినాఁడవు-డిగ్గన న్మముఁ జూచి కే।
న్నీరుసించెద వేల నిన్గన - నెమ్మిఫుట్టెను మాకు సీ।
యూరుపేరు వినన్గ వేడుకి-లూరుచున్నవి తెల్పుమా॥ 49

క॥ అని దువ్వలువ నొసఁగిన।
న్గొని మొలపై బిగియఁజుట్టు - కొని లేచి యతం।
డనె నా యేలికతోఁ గ।
న్గొ నలందున వేడినీరు - గొబ్బునజాఅన్॥ 50

మ॥ అనఘా! యేమని తెల్పువాఁడ నిఁకఁగ-న్నారన్గఁగన్గొన్నయం।
తనె దారాత్మజులున్న చోటు వెదుకి-న్గాఁబోయె శోకంబు నె।
మ్మన మాకొ న్గొనసాగె నంగములకు-న్మార్గశ్రమంబు న్దవ్వు।
య్యేను సుస్వప్నము నిక్క-మానటుల నెం-తే ఘన్త్రాతెన్బంచితిన్॥

క॥ మున్నీటి నావ ముప్పునఁ।
జిన్ని కొడుకుతోడ ముద్దు - చెలియ తొలంగ।
న్గన్నీటఁ గొండదడుపుచు।
నెనోన్నయిక్కట్లు దాఁటి యే - నిటులుంటిన్॥ 52

గీ॥ అనుచు నిట్టూర్పు నిగుడింప - నతఁడు మిగుల।
జాలిపడి బాటసారి కె - న్గేలుపట్టి।
తండ్రి నీవలె నీవారు - తప్పిబ్రతికి।
రేమొ సైరించు మందు మే - లెనయవచ్చు॥ 53

క॥ తెలివిన్గాని కడచినయది।
కలవలెంచలపోసి హాయిఁ - గనుమని నుఱవు।
న్గాలిపించు పింతవూఁదే।
నెలఁజొక్క స్జేసి యాత - నిన్దోడొక్కనుచున్॥ 54

గీ॥ కుడుచుమిద్దెయు కా దొర - గొబ్బుసఁజని।
చేడెలన్గాడి పుచ్చుట - లాడుకొంచు।
అకటునన్మించి పలుచవు - లారగించి।
యాటపాటల వెన్నెల - బైటనుండ॥ 55

సీ॥ సన్నపుపలుకులతోఁ - గిన్నెరజతఁ చేసి -
జేఁకుపొగడఁబాటఁ - బాడునొకతె॥
యడిగెఁ జందురుఁడు నా - కందె చూడుఁడియని -
యేలికమోము ము - ద్దిడునొకర్తె
చెల్లికే వెన్నెల - చీరెగట్టితినని -
తొడవులూడిచి నవ్వఁ - దొడఁగునొర్తె।
యింతలో నాకెవ్వ - రెనయుని నున్నని -
రతిసంపు దిన్నపైఁ - బ్రాకునొర్తు।

కోయిల వెక్కిరించుచు - న్గాయునొకతె।
యెద్దిమో తలపోయుచు - నేడ్చునొకతె।
యేమియల్లరియని కసఁ - బ్రామునొకతె।
సోలియాడెడు నొక్కతె - చొక్కునొకతె॥ 56

ఉ॥ చల్లనిరేయి తెమ్మెరలు - చక్కిలిగింతలువెట్ట వెన్నెల।
ల్చల్లఁగ నవ్వ నెచ్చెలియ-చక్కనిమోము మగండు నింపు జా।
బిల్లిగనెంచి సందియము - వీడఁగముద్దిడి యంచు నిక్కవం।
బెల్ల సెజ్జయేమి నొ - కింత పరాకున పంట్లు మ చేకిన్॥

గీ॥ ఒకపరి తెలుఁగక వేడ్కల – నోలలాడు!
కారివలెఁదానుగూడఁ దా – ర్మరుపడుచు!
కలఁప్రులోనున్న చెలియ ద – వ్వులఁ జెలంగు!
పగిదిఁ బొరపాటుతోఁ 'దడఁ – బాటుచెందె॥ 58

శా॥ ఏమేఁ యెట్టులవచ్చినావు పసివాఁ – డెచ్చోటనున్నాఁ డహో!
స్వామీ ప్రాణము మళ్ళిచేరినటుల – స్వాప్నస్థజా చెప్పు య
న్నామోదంబునఁ గౌఁగిలించుటకు డా – యన్దల్చితో నాసవం
బీ మోసంబొనరించెఁగాని చెలియే – డీ యన్చు సిగ్గందెనన్॥ 59

క॥ కని యుండదొక్క మొగిఁ బ
క్కన నొండొరుఁగాంచి వవ్వ్వ – కొనిరంతటఁ జిం!
ట కణఁగసాగ జ్జుక్కలు!
వెనువెంట జ్జందమామ – వెలవెలఁ బాఱెన్॥ 60

సీ॥ ఒంటిపాటునఁ బొక్కి – యురువయి కెంపెక్కి –
విన్నుతూర్పునఁదూఱె – వేగుఁజుక్క!
ఱెక్కలు జాడించి – ముక్కునుగోడించి –
కొక్కొరోకోయని – కూసెఁగోడి!
నీటితావులఁదాటి – తోఁటల గడితేటి ..
మొడలు చల్లనసేయు – చుండెగాలి!
యొదుజాములపద్దు – గాఁదోఁచునిఁకఁబ్రొద్దు –
పొడమెడునని చాట – దొడఁగె గంట!

పట్టులెడఁబాసి పిట్టలు – బయటఁబాఱెఁ!
దలలు తిక్కించి మొక్కలు – చెలువుమీఱె!
బలిమితోఁడుత నిద్దుర – బరువుజాఱె!
దెబ్బున న్వేసవిన్రేయి – తెల్లవాఱె॥ 61

మ॥ బళిరా తేఁచులు జాగిలంబు లుసికొ - ల్పన్జేసి పోనీకుఁడా।
పులినంచు న్జైలికానితో మిగులఁ ద - న్పన్బ్రొంది బాఁకుల్తుపా।
కులు చేఁబట్టి బిరానఁబోయి యచట - నొంకేమియు న్లేక క।
న్నులనిప్పల్గురియించు బెబ్బులిరొద - న్దాఁయున్గుండేసివన్॥ 68

క॥ వ్రేటువడియుఁ బొఁగచాటున।
మాఁటినటుల బాటసారి - మెయిదాఁటన్నే।
రీఁతె పులినోటఁ నాటుచు॥
మాఁటెనతఁడు తన్ను మేటి - మాటికి మెచ్చన్॥ 69

ఆ॥ ఇట్లు వేఁటనెఱపి - యేపారుబడలిక।
లడఁపఁబానకంబు - లాని గుజ్జు।
ములను మార్చి యెక్కి - ప్రోలున కరుగుచు।
బాటసారికిట్లు - పలికి తేఁడు॥ 70

క॥ ఓయన్న యింతవాడవ।
నీయోర్పునాపు తెంపు - నేర్పున్గంటిన్।
నీయడిగినదెల్ల నిడెద,
హాయిగ నాయొద్దనుండు - మా యింకమీఁదన్॥ 71

క॥ ఎనిమిది యామడలు వెడలు।
పున మఱియంత కిరురెట్లు - పొడవున నీ నే।
స్తుని పట్టమెట్టులుండెనో॥
కనుమా నలుకడలఁగడలి - గాచుచునుండన్॥ 72

గీ॥ దొడ్డకొలనుండె నికొండ - తూర్పునందు।
నదియు నీకంటఁబడవచ్చు - ననుకొనియెద।
అందులోఁబుట్టి పట్నము - నంతఁజుట్టి।
మించి యాపెద్ద యేఱు పం - డించుచుండు॥ 73

క॥ నిన్న మనము న్నమిద్దియ।
యెన్నఁడికొండఁ బొలిచి - యెవరొనరించిరో।
యెన్నన్నాలము మే మిది।
యెన్నెన్నోతరముఁబడి - నేలుచునైనన్॥ 74

గీ॥ ఇంకఁబల్లంబుచేరితి - మిటకు నాలు।
గామడల మేర మునకోట యలరుచుండు।
గడియలోఁగాల్వపైఁ బొగ - పడవమీఁద।
నేగుదము రమ్మి వడిగఁ - బ్రొద్దెక్కకుండ॥ 75

ఆ॥ అనుచుఁదన్నుఁగూర్చి - తనపట్టముగుతించి॥
బాటసారితోడఁ - దేటపఱిచి।
యతనిఁదోడుకొనుచు - నాదొరయేగు నా।
యేటికాల్వపొంగ గుడి - యెడములందు॥ 76

లయగ్రాహి॥ నింగికిఁజెలంగి తుద - లంగలిసి పందిరి వ -
లెం గడగి నీడల నొ - సంగుబలుపోఁకల్
సంగడినెసంగి నల - వంగముల కొమ్మలఁబె -
నంగి కొనసాగు విడె - ముం గొలువునాకుల్।
రంగుమెయిఁ బండుగొల - లం గలిగి నిచ్చెనలఁ -
వంగినయనంటుల బె - డంగయిన మోకల్।
ముంగలఁ బొసంగఁజలు - వం గొనుచునంటు లెన -
యంగఁ బరపొ పలు తె - అంగులగు మ్రాఁకుల్॥ 77

చ॥ చెలువుగఁ గాచు వేర్వనస - చెన్నఁగి కొబ్బరిబార్లు రేవుల।
న్బొలుపుగ మేటియెల్లెలల - పోలికనూడలడించి మించు మ।
ఱ్ఱులు దమయిన్కి- చెప్పఁగ మ-ఱుంగగువాడలు నూళ్లు పల్లెలు।
న్వలసలు చావడుల్మఠియుఁ -బచ్చనిపైరులతోఁబొలంబులున్॥

ఆ॥ కనుచుఁబడవకాల్వ - కట్టలోఁదూఱి।
మబ్బులందు డాఁగి - మఱల మఱలఁ
దోఁచు ప్రొద్దుపగిదిఁ - దొడరఁగ నవ్వారి!
బట్టువారి కెల్లఁ - బసిఁడినిడుచు॥ 79

చ॥ చనిచని మన్నెకాఁడు తన - సంగడికానినిజూచి నెయ్యుఁడా।
కనుమదె పెద్దయేఱడవి - కైవడి నోడలఁ మిన్నుముట్టుచుం।
డ నెటుల నైదుకోసుల వె - డల్పు[illegible] వాఱుచుం।
డెనో యెటులన్బిరంగులు వడి న్మసాకు మ్రోఁగుచుండెనో॥

ఆ॥ అనుచుఁ జెప్పుచుండు - నంతలోఁ బెనుచోఱ।
వలెఁ దమ పొగపడవ - పట్నము దరి।
గోనఁగ నాల్గుజోళ్ళ - గుఱ్ఱములూప్వన్చిన।
బండిమీఁద వారు - బయలుదేఱి॥ 81

సీ॥ ఆమడచదరమై - యంతట నేటి న -
రుబికించు పెన్మర - లోపు[illegible]।
బెద్దమేడలు కల్గి - విథివియై దిద్దిన -
యట్టు తిన్నని వాడ - లం[illegible]రా।
మిన్ను గప్పుచుఁ బొగ - మేటిమబ్బులవలెఁ -
జెదరియుంగళ్ళపైఁ - జెలఁగుచుండ।
సందు వెట్టఁగనీక - యందఱున్బాజాట
కడపలరాకపో - కలను సలుప।

బిచ్చగాండ్రును వెలయాండ్రు - పేరునకును
న న్గలుగక వెలయుచుండు - నగరునందుఁ।
దనరువింతలు పేర్వేరఁ - దన సకునకుఁ।
జూపుచు దారయేగెడు - చొప్పునందు॥ 82

చ॥ తెరువునొకింత లేక చను - డెంచెడు మూఁకఁ దోలంగఁ బుచ్చు బ-
ల్తురికి వటాక్షదూర్పులు త - ళుక్కున వెండకుఁ బొల్చు పన్నుల।
న్నొరఁగు తుపాకులూనిన సి - పాయిసళమ్ముల జోళ్ళచప్పుడు।
లొప్పరిఁ బోరిబూరతా అవళు - లున్నసుచక్కటిఁ బిక్కటిల్లఁగన్॥

సీ॥ తడఁబడి కొప్పులు - సడలఁగఁ బయ్యెద -
లెడల మేడలపయి - కెక్కువారు।
కనులారఁ జూచి దీ - వన పాటపాడి దో -
సిళ్ళతోఁ బూవులు - చల్లువారు
పల్లమునందలి - పడఁతులకు స్దండ్రి -
వలెఁ గోకిలిడునంచు - నలరువారు॥
తగవు నొక్కింతయు - సద్దనొల్లఁదు నిజ -
ముగ వేలుపితఁడని - మ్రొక్కువారు।

నోము దొరసానిదేయని - నొడవువారు।
సొగసుఁ గాంచి విత్తాపునఁ - జొక్కువారు।
నగుచుఁ వెలువలు గనుచుండ - నాతఁడంత।
తోన మెల్లనఁ దనకోట - లోనికరిగె॥ 84

క॥ ఆకోటకు నల్దట్ల।
ప్రాకారమగ్డ్తయు న్జా - ర నసాధ్యముతో।
ఆకోటలోని మేడలు।
నైకొన్న సొగసులఁ బొగడ - గ నశక్యముతో॥ 85

ఆ॥ అట్టి నగరిలోన - నరుసువలె న్బాట।
సారి కొల్వఁబడుచు - సంతసంబు।
పడయఁజాలక దొర - కడకొక్కనాఁడేగి।
కనుల నీరునించు - చనియెనిట్లు॥ 86

క॥ అకటా రోగికి విందొసఁగునటు లీ - వంచించు భాగ్యంబు రి।
త్తకఁదా చెల్లెలఁబాసి మేటివలవం - తన్గాందు నీ సంగడీ।
నికి రాజోత్తము యాత్ర బాన్ధవుఁడనౌ - నిప్రాపు పోనాడి నే।
నిఁక నెందేగుదు నాలుబిడ్డల మఱే - నే తీరునన్గాచెదన్॥ 87

సీ॥ తాను ముందుగ లేచి - తానముగావించి -
పొందమ్మి వలె నాకు - మోముచూపు।
విల్లు నీటుగఁ జేసి - యెంతయు న్గ్రొంజపు -
యూరు వంటలు కడు - పార మేపు।
నేఁబైకిఁజని మళ్ళి - యేతేర నాయడు -
గులఁబట్టి నిమిరి బ - డలికఁబాపుఁ
నామాట కెన్నఁడై - న నజ్జవదాఁటక -
నానేరమెట్టిది - యైననోపు।

కలిమి లేముల నిల్లొక్క - కరణి జరపు।
నన్నిటికి నెక్కుడంచు - మర్యాద నెరపు।
కరము బీదలపైఁగని - కరము పరపు।
నట్టి యిల్లాలిఁ బాసి నే - నెట్టులుందు। 88

క॥ అని వగచు బాటసారి।
న్గని యెకిమీఁడూరడించి - కనికరమున ని।
ట్లనె నన్న యింక సకల।
న్భుని లేదొక మేలుమాట - పలికెద నిదుగోన్॥ 89

గీ॥ పట్నముజ్జేరునపుడె నీ - వారికొఱకు।
సరయఁబంపిన బంట్లెల్లఁ - దిరిగివచ్చి।
చల్లగా నీపడఁతియును - బిల్లవాఁడు।
బ్రతికినారంచు నిప్పుడే - పలికిరి చుమీ॥ 90

చ॥ పిఱుఁదులమీఁది యుంగరపుఁ - జేర్లవలెన్దనుఁజొంది జాఱు మే।
న్న అసవరింపఁ శోకమొయి - నిండఁగమాసిన చీరగట్టి వె।
న్నెఁ అప్పుడుఁ జూచు లేడికర - ణి న్నలుతట్టులు గాంచుచూర్పులె।
న్న అపుడు జల్దిగుల్పడెడు - నీయొల పాయపుటింతి కన్పడెన్॥ 97

గీ॥ తెలిమొగలి పువ్వురేఁతరే - కుల తళతళ।
గలుగు చెక్కిళ్ళనుండి వా - ల్కనులనీరు॥
వలుదముత్తియములవలెఁ - బడుట నీడు।
చెలువ వలవంత కొఁకవింత - చెలువుదెచ్చె॥ 98

క॥ వినుమిటకు డాకడ వ్వఁడు।
నెనిమిది యామడలమేర - నెసఁగినపట్టం।
బున కిచటి సరకులన్గొనఁ॥
జనుదెంచిన యోడ నీదు - చానన్దెచ్చెన్॥ 99

గీ॥ వెలపొడుపునాఁడు నీముద్దు - చెలువయుచట।
దావియొక్కతె చిఱుతనో - దార్పుచుండ।
వంటకంబులఁగొని యిది - వ్రాసిచీనిఁ।
గావుఁడనిమాకుఁ బెక్కురూ - కలిడి చనియె॥ 100

క॥ అని నమ్మకంబు పుట్టిం।
చినఁ గొండ తెఱఁగువఁబొంగి - చెలియూసులఁ గ।
ట్టినమాడ్కిఁదోఁప నొకకొం।
తనిలిచి యీబాటసారి - తలపోసె నిటుల్॥ 101

ఆ॥ కట్టుకొన్న చెలిమి - కట్టులఁదప్పితి।
నట్టుకొన్నవాఁడ - నెట్టులైతి।
కట్టరాని మనసు కట్టె - బ్రతికితి ని।
నట్టు కొన్నవాఁడఁ - గనుకఁజెల్లె॥ 102

గీ॥ బోటి బ్రతికినదని నాకుఁ - దేటపడియెఁ।
గాని నాయుర్వి నెఱుఁగద - చాన యకట।
పిట్టవలె నాకు జెక్కలి - వెలయు నేని।
బడఁతిఁ గనకుందునే చెప్పఁ - బాటలోన॥ 103

చ॥ అని తలపోయుచున్నగను - నాతని నేలికఁ బుజ్జగించి యి।
ట్లనెఁ జెలికాఁడ నీవు చెలి-యన్నను గొందువు సైఁచుమంచు నాఁ।
డనినది నిక్కమయ్యెను గ-దా యిఁకఁ గుందకు నిన్ను నంపుదా।
పున నొకమేలు నీవలనఁ - బొందికగావలె నమ్మిచెప్పెదన్॥ 104

గీ॥ ఇట్టి లాయరు నాతని - నిట్టపఱచి।
కోటలోనికిఁ దోడ్కొని - కొంతతడవు।
వేడుకలఁబుచ్చి యవ్వాని - తోడ నొంటి।
నరిగి యొకపూవుఁదోఁటలో - ననియె నిట్లు॥ 105

క॥ కనఁదగిన వింతశాస్త్రము।
తనంత జతపడినయష్డ - తత్వజ్ఞుఁడు వొం।
గునటుల నినుగన్న దిమొద।
లనఘా నీహితుఁడు లోన - నలరున్జవిత్రా॥ 106

గీ॥ అదిగొ వచ్చెడుఁ జూడునా - యన్న కొడుకు।
చెలఁగి కోల్పులినాడించు - జెట్టిమిన్న।
తండ్రి కెక్కుడుగా నన్ను-దలఁచుచుండు।
నెల్ల చదువులు నేర్చు నీ - పిల్లవాఁడు॥ 107

సీ॥ మావంగడముపాడి - నేవినిపించెద -
నన్నదమ్ములు పెద్ద - పిన్నవరుసఁ।
బరఁగియేల్బడిచేయ - వలయును మాయన్న -
యేలి పట్టంబు నా - కిచ్చె నేను।

వీనికినొసఁగెద - వేఁడు నాకొడుకుల -
కిచ్చుఁగాపుగడె యి - క్షెఁగవలయు।
నిరువదియైదేండ్లు - కేలికయ్యె పెత్త -
నంబంతదనుక నో - నర్చఁదగును

పిమ్మట న్మన మానాఁడు - విడిసియున్న।
కొండపైకేగి హాయిగా - నుండనొప్పి
పెద్దలేర్పాటుచేసిన - సిద్దుపాట్లు।
తెలిపెదన్వీను మావేల్పు - కొలుపుఁగూర్చి॥ 108

మ॥ కలయందె త్తెడు మేనుతోఁచెడు జ - గత్కార్యంబులున్నిత్త స।
ఇచ్ఛలత న్వాస్తవమందు చందమున నీ - సర్వప్రపంచంబు న।
జ్ఞాలకు నిక్కముగాఁ గనప్పడెడుఁ బ్రా - జ్ఞుల్స్వాప్న భావంబు ని।
శ్చలమాట న్దమకన్న వేఱుగన కి - శత్వంబు ప్రాపించుచున్॥

ఆ॥ కొచుముట్టుకొనరు - కలనైన మావారు।
మేలె కాని కీడు - జోలిపోరు।
కల్ల పెద్దతప్పుగాఁదె - గడన్నదుఁ।
పరువు నయము మాకు - బ్రతుకుకన్న॥ 110

క॥ మా మతమన్నిట్టని।
మామ యొకండుండె మేన - మామ యితనికిన్।
సీమగువయున్న పట్నం।
బేమరఁ బోకేలునాతఁ - డెక్కుడుదొరయై॥ 111

క॥ ఆతఁడు జగడంబిప్పుడు।
మాతోడ న్బెట్టుకొనియె - మనసుల యెరుగ॥
మా తెరువులు రెండు నెడం।
బై తిన్నఁగఁ గలియ వడ్డు - లైనన్దప్పన్॥ 112

క॥ గుడియను పుష్పవిమానము|
పడంతి పురాణము - నేలుబడిపట్లచోట్ల|
మడి మైలాలచుఁ బిల్చ
వ్వడు సేవ ప్పిప్పులచటి - వారలచేతన్॥ 113

గీ॥ అన్న విని తేరితేరి యా - యరుసునకొక|
కొంత్తుంకొనిన నామీన - గోడలఁదియు|
పేరుమనోహరాలఁ గనుచిన్న - నాఁడు కలిసి|
యుంటనొకకొరులఁ దవిలి - యుండిరిపుడు॥ 114

క॥ అన్నిట సేహజ్ఞుఁడు|
స్నా కి చింతాతె కట - కట్టడిదయ్యెం|
బెన్నఁడు జతగూర్చె కునో|
యన్నా యూరాచరికమొ - యడ్డయ్యెఁగదా॥ 115

గీ॥ ఒంటిపాటునఁ గ్రుమ్మరు - చుండు మదవు|
తేఁగ్గవలె నాఁకలి నిమర - లెఱుఁగఁ డక్క|
టకట యూపీనుకొంటిగ - నరుగఁదలఁచి|
సైఁచకున్నాఁడు నాకేమి - తోఁచకుండె॥ 116

గీ॥ బలము సఙ్గీత సాహిత్య - వైభవంబు|
చక్కఁదనము స్వతన్త్రరా - జ్యంబు లేఁత|
పాయము రారు వానిఁ ద - ప్ప మఱియెవనిఁ|
గట్టుకొన నొల్లనంచు నా - కన్నెనిలిచె॥ 117

ఉ॥ ఇన్నియుఁగల్గినట్టి మొరుఁ - డెందున సీతవికన్న లేమి నా|
కన్నియ తా నెఱింగినది - కావునఁ దండ్రికినట్లు చెప్పె నం|
త న్నలు దల్లరాజుల కె - తండది వెల్లడి చేయఁబంచెనో|
యన్న యిఁకైదునాళ్ళగడు-వై కనిపించెడుఁజుమ్ము పెండ్లికిన్॥

గీ॥ అకట మాయన్న నితని నా - కప్పగించె।
నేను నీకొప్పగించితి - నీకొలంది।
యొజ్జేఁగి యటుగాన మీర లిద్దఱు నడంగి।
తెరవలన్గాడి బిరబిర - ద్దరలిరండు॥ 119

క॥ మీరే తెంచినతోడనె।
నారాజ్యంబన్న కొడుకు - నకు నిచ్చెద నా।
త్మారాములమై యడవి।
జ్జేరి మనము పిదప ముక్తిఁ - జెందఁగ వలయున్॥ 120

ఆ॥ అనుచు బాటసారి - కా నేలఱేఁ డన్న।
కొడుకు నప్పగించి - గడుసుబంట్లఁ।
దోడుచేసి యేటి - యోడ రేవువఱకు।
నంపకంబు పెట్టి - యరిగెనంత॥ 121

క॥ కట్టెడలి కదలి మేల్కని।
బెట్టిదముగ నావులించి - పెన్బొగ లెగయన్।
నట్టేటన్నడి పర్వులు।
పెట్టె న్నౌకోడ మిగుల - వేడుకప్రబ్బన్॥ 122

గీ॥ అప్పుడు బాటసారి - యారాచపట్టితో।
నోడచుత్తరువుల - తోడ వేడ్క।
నంద లేని తనదు - డెందము ద్దెలుపుచు।
ననుఁగుఁదనము దనర - ననియె నిట్లు॥ 123

క॥ ఓడక పెంపుడు సింగఁపుఁ।
గోడెవలె న్వచ్చెదీవు - కొమరుఁడ వకటా।
జోడయిన చేడియల విడ।
నాడి యునికి మనకు నొకటి - యై కన్పట్టెన్॥ 124

శా॥ అన్నా కన్నతనంబునుండి తగులై-యా ముద్దరాలెంతయు।
విన్నన్నన్నోననంచు వింటిఁ దనకు-న్నీ వేడ్క-దెల్పన్న నీ।
కెన్నఁడేయపి యానవాలిడియె నీ-వీతీరు చేడ్పాటుతోఁ।
జెన్నన్గాలుటలేల నా మిగుల రా-సింగంబు పెంపందుటన్॥ 125

గీ॥ మీఁదఁ గొండలోరగ - మేల్కనియు న్నిదు।
రించునట్టి మనసు - రెచ్చ ముద్దు।
గుమ్మయాపినట్టి - కమ్మఁజేకొని చవు।
లూరఁజదివె బాట - సారికిట్లు॥ 126

క॥ వలపుద్దెలుపఁగఁ జాలదు।
కలమ్మ మనచిన్ననాటి - కలసిమెలఁగుటల్।
తలపునకు వచ్చినయెడ।
న్నిలుచు న్నా యసువుదాఁచ - నేర న్నావా॥ 127

గీ॥ వావిమేనఱికము - పసితనంబుననుండి।
చనవుచేఁత యెంచి - కొనిన సొమ్ము।
దవ్వులయ్యె నిందు - జవ్వనపున్గోర్కి।
కఱవుదీర నెపుడు - కనెద నిన్ను॥ 128

గీ॥ మన తగులమున నీమేన - మామకూర్మి।
పూను తెన్నునసేర్పుచు - క్కాని మలపి।
గడియలోపల నెడఁబాటు - కడలిదాఁటి।
రమ్ము నీకల్మి బల్మి బిం - కమ్ములలర॥ 129

క॥ పలుమఱుఁ దనపై నీచూ!
పులు వాఱఁగ నెదుడెంద - మున్గొని నీ చే।
తులనంటి ముందుగాఁ బెం
డిలి నీ కీసవతి కమ్మ - నెఱపుస్సమ్మా॥ 120

సీ॥ చిలుక బూచులఁ గల్పి - జిలిబిలిగాఁ బల్కి -
సాఁ బాలుగాఁ దిన్న - చల్దిబువ్వ!
చిఱు జగడములాని - బిఱబిఱఁబోత్రాని -
తనివితీరక యాడు - దాగురింత!
పట్టుపంతములాడి - బాగుగాఁ గవఁగూడి -
మెలపునఁ బాడిన - మేలుకొల్పు!
అంటు జంటగఁగట్టి - దంటగా సిర్వోటి -
నిలుపు సంపఁగిగున్న - తొలిసమర్త!

ఆనవాళ్ళివి నన్నుఁగ - న్నారఁజూప!
నేగు దెంచిన యీగాలి - ప్రోగుబొమ్మ!
మనసు వచ్చినయల్లని - స్మరులుకొల్ప!
బొగలుచున్నది నిక్రుంపు - బొందియుచట॥ 131

క॥ అని వగమీఱఁజదివి దా
పునఁగల యచ్చెలువయంద - ము ద్దన కన్దో!
యినలేఁదు కొంచూర్పుల నిడు!
చు నతడు చెలివాలుఁగనులఁ - జూచి యిటులనున్॥ 132

గీ॥ మొదట వావు లెఱింగిన - ముద్దుచూపుఁ!
బిదపఁ గురులుంచు దాపున - బెదరుచూపుఁ!
దగిలి యెడఁబాయఁజాలని - దిగులుచూపుఁ!
గనులదోఁబూచి చూపు నా - కన్నెచూపు॥ 133

చ॥ అని దిగులొందు నాతనికి - నంతటనూర్చుచు బాటసారి యి!
ట్లనెఁ జెలికాఁడ యచ్చెలువ-నంటకయే యిటు వేగుచుంటి వే!
మనిమొన నెల్లవేడుకల - నందంగఁజేసిన గానిఁ బాసి పో!
కన్న నను దలంచియైన నిఁకఁ-గుందకు చూడుము రెయిమింతచెడిఁ

సీ॥ ఆకసంబున నడు - గంటి చుక్కలు అవ -
లట్టు చీఁకటినీట - నలరుచుండెఁ।
గరఁగిన వెండి నీ - ర్వరపిన తీరున -
నలలవాలుఁగ మీలు - తలుకుమీఱె।
మీఁదు క్రిందులఁబొల్చు - మింటినట్టనడుమ -
గారడి యద్దమై - కడలితోఁచె।
దొప్పచేతులవలెఁ - మాఁగాడు కరడము -
ల్గొప్పచందువల జో - కొట్టుచుండె।

చుక్కజాడలఁబొగయోడ - చొక్కుచుండె।
గాడు పెల్లెడలన్జోల - పాడుచుండె।
నిగిడి గడియారమిదిగోఁ బ - న్నెండు వేసె।
నిఁకఁ జెలిమికాఁడ మనము పం - డు కొనవలయు॥ 135

క॥ అని రాకొమరు న్నిదురకుఁ।
జొనిపి తనకుఁ గన్న మూఁత - చొప్పడ కుల్లం।
బున నగపడు తన చెలియకు।
ననఁగఁదొడఁగె బాటసారి - యడలుచు నిటులన్॥ 136

మ॥ తరుణీకన్గవఁబోలి తెల్వియెడ ని-ద్రన్జొక్కనష్టాంటిపా।
టరయన్బొవని నిన్ను నన్నెడపెనే-యక్రూరదయ్యంబు కా।
ని రవంతైనఁ దొలంగకుండునుగదా-నీరూపు నాలోన న।
ద్దిర నాకిద్దియెచాలుఁ జూచుకొనెద-న్దెల్లంబుగానెప్పుడున్॥ 137

క॥ నిడువాలుకనులు తీయని।
నుడువులు ముంగురులు చెదరు - సుదురు న్మెల్పు ।
త్తడిమేను సన్నసడుము పొ।
గడఁ దగు నీనడకక నులఁ - గట్టుసుమీ॥ 138

సీ॥ అడుగులుగంద నె - న్నడుమువడఁక నీవు-
తిరిగిచూడక నీవ్వు - తెచ్చుహాయలు।
చెక్కిళ్ళకిరుగడల్విప్పురు - చేతులఁజేర్చి-
మొప్పఁగా నీవు పో - యున్నాదుతీరు।
డాకేలు వెన్నమీఁ - దన్మోపి నెమ్మెన-
వంచుచు నీవు వ - డ్డించు చెల్వు।
కొనగోళ్ళ నీనియు - ద్దునుముచు మడుపుల-
మచ్చికతోడ నీ - విచ్చు సొగసు।

నన్నుఁగనినప్పుడెల్ల నీ-కున్న జోక।
నేను జబ్బుగనున్నప్డు-నీ యలజడి।
నాదు చుట్టములందు నీ-నమ్మకంబు।
నెంచనుకఁదలపోయుదు-నెట్టులోర్తు॥ 139

క॥ ఇదియేమి సోద్దెమోకద,
ముదితా నిన్దలఁచి నేను - పొందుకలవరం!
బెదకింపైతోఁచుచు ను।
న్నది యిటఁతక్కినతలంపు - లన్నిటికన్నన్॥ 140

ఉ॥ ఎన్నఁడు నిన్నుఁగన్దుఁ జెవి - కింపుగ నీ నెరముద్దుమాట లిం
కెన్నడు విన్దునక్కట చె - లీ యిపు డెక్కడనున్న దానవో।
నాన్న యటంచు బిడ్డఁడను - నప్పుడు నీ యెద యెట్టులుండు న
న్నన్న తొలంగుచున్న యసు-ఆసమెపోవఁగనీక నిల్పెడున్॥

గీ॥ అనుచుఁ బెక్కు తెఱంగుల - నతఁడు పొగలి।
నెగడునిద్దురఁగడకంటి - నీటఁదుడిచి।
అనుఁగుఁ జెలికానిఁ దెలవాఱె - నంతదెల్పి।
ముచ్చటించెనిటుల వగ - పున్నగించి। 142

శా॥ అన్నా పోయెఁగఁగూర్కు-వట్టినదియే-యక్కా జూడుమా యోడకు
న్నన్నన్నావ్యాయలువిచ్చి యెత్తుకొనకెం-తో లోఁతుగాఁదోఁచు నె।
న్నెన్నెన్నెకోసు. చేర నద్దిర యిదే-మీకొండలు నెటులు।
న్నిన్నెన్నెన్నెనవెల్లి వెన్నెనుకకు-న్నెపర్వులన్నెట్టెమన్॥ 143

చ॥ అదె యనమేఁగుపల్లె మెటు-లబ్బురమై పొడగట్టుచుండెఁ బ।
ల్లెకపెంపవించు గుజ్జుమట్టు-చిల్కినయోడపయి న్నిడంబు లో।
న్నికమాఁగ నన్నలద్దెలుప-వేగిరపాటున మిట్టుపల్లెము।
ల్గదియుచుఁజూడు తెప్పలల-లంబడి యిచ్చటి కేఁగుదెంచెడిన్॥ 144

గీ॥ అన్న నారలిరువురు వా-కొన్న మిగుల।
నాస యుప్పొంగులూర సం-తోస మలర।
ఓడ డిగి పరువఁజొచ్చి - యొక్కకడియ।
కొడ్డునకుఁజేరె పోయెగ - నన్నయంత॥ 145

ఆ॥ వారు తమకు నెదురు - వచ్చిన యారాచ।
కన్నె చెలులఁగాంచి - కలతెఱంగు।
వినఁగ వేడ్క-పడఁగ - వివరించిరవ్వారు।
కేలుదోయి నొసటఁ - గీలుకొలిపి॥ 146

క॥ మమ్మేలు రాచకన్నియ।
మిమ్ము న్గనపూవుఁదోఁట - మేడఁగలయఁగా।
నిమ్మోనరిచి తత్తరమున।
రమ్మని యిదె కెంపుటుంగ - రము గుఱుతిచ్చెన్॥ 147

క॥ అని చెలులిచ్చిన యుంగర।
మును గన్గవ నద్దుకొనుచు - ముద్దిడుకొన్న।
క్కునఁ గదియించుచుఁ దన చిటి।
కెన వ్రేలనమర్చి దాని - కిఁబలికె నతఁడున్॥ 148

ఆ॥ నీపసిండిచెలియ - నెమ్మోని జిగిదెల్పు।
నీదుకెంపుమోవి - నిగ్గుదెలుపుఁ।
గాని చెలువమనసు - గనిపెట్టి చెప్పక।
యుంటివేమొ ముద్దు - టుంగరంబ॥ 149

క॥ చెలియేమి చేయుచున్నది।
పలుమఱు నిడువాలుకనులఁ - బరపుచు నీతోఁ।
బలికిన పలుకులు కలవా।
తెలుపుమనఁగఁ జెంతనున్న - తెఱవ లలరుచున్॥ 150

ఉ॥ తెలిపిరి తేఁడ నీవు చను - దెంచుటకు న్వాలనెంచిచూప మా।
వెలదుక పెంపకంబు పసి - పిల్లని ముంగలఁగాయపండుల।
న్నిలుపుచు నీదు రాక విని - నివ్వెరతో నొకకొంతనమ్మక॥
వ్వాల నగపర్చు వేడ్క కను - పండుగచేసెను మాకదెంతయున్॥

చ॥ కలకలనవ్వువేలుపుల - కై కయిమోడ్చుచుఁ బైటదిద్దుకొం,
చలసట చూపుముంగురుల - నద్దములో సవరించు దిట్టచూ।
డ్కలఁబచరించు మమ్ముఁగనుఁ - గొంటకు సిగ్గలరించు నెత్తల॥
న్బలుమఱు నూఁచు మాచెలువ-పట్టఁగఁజాలని వేడ్క మీఱుటన్॥

క॥ అని చెలులు సెప్పి తోడ్తోనఁ।
దనివిన్గొని రాచపట్టి - తనకైయేర్ప।
ర్చిన క్రొంబూఁదోఁట విడిది।
కనుఁగుంజెలికానితోడ - నరిగె బిత్తానన్॥ 153

ఆ॥ అవుడు బాటసారి - యారాచపట్టికి।
జరుగువేడ్కఁజూచి - సంతసించి।
యును మఱి తన చెలియ - యున్న చొప్పెటు గాంతు।
ననుచు నెమ్మది నను - కొనియెనిట్లు॥ 154

సీ॥ కొన్నాళ్లు లడియాసఁ - గొనుచుండు డెందము -
చెప్పంచేఁతలకెల్ల - నొప్పియొప్పి।
తలఁచని యిమ్ములు తమయంతఁ జేకూరు -
నప్పుడు రానీక - రొప్పిరొప్పి।
కొన్నాళ్ళు పొట్టకే - కక్కుర్తికై యుండందఁ
డెన్ను మాలిన బొందిఁ - ద్రిప్పిత్రిప్పి।
యర్మిలి గనకుఁడో యయ్యలారాయని -
గొప్ప నా వలవంతఁ - జెప్పిచెప్పి।

అడియటులఁ గాని యెడఁ నేమి - యాదు నేను।
మరియు బ్రతుకుటయో మొండి - మొరడువలెను!
కాదు మనియెద నింక నీ - మీఁదనేమి।
యగును నాపని నానాట - నరుగుటకద॥ 155

గీ॥ జగముతో జోలి నాకుఁ గ - లుగుటవలన।
నామనసు దిట్టపడఁగ నిం - తవఱకైన।
నిల్వఁజాలితిఁగాని న - న్విడిచి యన్నె।
మెఱుఁగని చెలి నా యెడఁ బాటు - నెట్లు సైఁచు॥ 156

గీ॥ పిల్లవాని నెవరికైనఁ - బెంచనిచ్చి।
యకట నను జూడఁగ్గెడు - నాసదొఱఁగి।
నా గరిత నా మనుగడపు - నాదిపాదు।
బలిమిచేత నుసుఱులెడఁ బా సెనేమొ॥ 157

క॥ కానియెడ న్మృగవాలక।
మూని మగువ లోన మిగుల - నుడుకుచు నే నెం।
దైన నగపడుదునోయని॥
తానూళ్ళన్బల్లెలందుఁ - దలడిలు నేమో॥ 158

గీ॥ తలిరుటడుగులలో ముండ్లు - దగిలెనేమొ।
పసిఁడి మేనెండ తాఁకునఁ - బడలెనేమొ।
పట్టుకొత్తనికురు లట్ట - గట్టెనేమొ।
నా కనుల పండువింకఁగా - వఁ బడదేమొ। 159

సీ॥ నిను తెప్పపాటైనఁ - గనుకున్న నోర్వని -
కన్నులు కాయలు - కాయవలసె।
నీమాటలన్నసిం - తే విననేరని -
ములుచచెవులు చెట్లు - మొలువవలసె।
నీదు పేర్చవిగొంట - నిమున మేనియు మాన -
నట్టి నాలుక గడ్డ - కట్టవలసె।
గడియ సేపయిన ని - న్నెడసి సైరగఁచుండు -
గుండె జల్బండరై - యుండవలసె।

కటకటా నాదు మేల్మి బం - గారుబొమ్మ।
నా బ్రతుకుపట్టె యొచటను - న్నావొ వాలు।
కన్నుఁగవ నీరు వరదలు - కార్చుచెట్లు।
కుందుచున్నావొ యిపుడున - న్నుంవలంచి॥ 160

ఆ॥ విన్నఁబోయి యిట్లు వెత - చెందు శాజాటు।
సారె కోమఁగాంచి - జాలి మించి॥
అపుడు రాచకొమరుఁ - డచ్చెలికానికిఁ।
దలఁపు మఱలునట్లు - పలికెనిట్లు॥ 161

ఆ॥ అయ్య యింకమీద - హాయి మనకుఁగల్గు।
నంచు గుఱుతు చెప్ప - నాకసంబు।
వేఁడిగాడ్పు వేస - విన్నాసి చల్లని।
మబ్బుఁగ్రమ్ముచున్న - మాడ్కిఁగంటె। 162

సీ॥ తొలితెల్ల కొండల - వలెనున్న మొగుళులు -
గొప్పలై నీలిరం - గులఁదనర్చె।
దూదిపింజెలలాగు - దొడ్డమబ్బుల నేకి -
కరువలిపఱపులు - గా నొనర్చె॥
వెండిచబుకుఁ ద్రిప్పి - వేసిన యట్టులు -
మెఱుముతోడుత బెద్ద - యుఱుముపుట్టె।
నేలఁగమ్మనితావి - నెగడించు చంపంద -
వలుదలై పెక్కుచి - నుకలు మొదలిడె।

మింటికి మ్మంటికిఁదఱచు - మీఱు వాన।
ధారలను తీఁగెలబిగించి - యూఱవ వడి।
వీణెవాయించు నెఱజాణ - గాణమూడ్కి।
పంచముల గుప్పి గాలి పా - డందొడంగె॥ 163

గీ॥ వంగియుక్కున నొకచిఱు - తల గదించి॥
చూడు వచ్చెదు నెనతో యా - మేడదరికి।
జడిసి పిల్లకు ఱెక్కలు - చాటుచేసి।
పట్టునపుఁ బర్విడెడు కోడి - పెట్టవలెను॥ 164

క॥ అనుచున్నన మదిఁద్రిప్పగఁ।
గనుఁగవ నగపడఁగనీక - క్రమ్మిననీటిన్।
మునికొంగునఁ దుడుచుకొనుచుఁ।
గనుఁగొని యూ బాటసారి - కడు నమ్రమునన్॥ 165

గీ॥ లేచి నిలిచి నిదానించి - చూచి కేలు
దోయి తట్టుచు నెగురుచు - దొడ్డనోట।
నదిగో నాదాది నాయయ్య - యిదిగొఁగంటి।
ననుచు నెదురేగె నేస్తున - కబ్బరముగ॥ 166

క॥ అప్పుడు దాదియు నాతనిఁ
జప్పునఁ బరికించి పోల్చి - సరగ ననియె మా
యప్పా నీబిడ్డండిదె
యొప్పుంగ నీయాలు నిచట - నున్నది సుమ్మా! 167

ఆ॥ ఇచటి రాచకూఁతు - రెంతయుఁ గూర్మితో
నమ్ముఁ బెంచుచుండె - మా మొఱ విని
వెదకి వెదకి విసికి - పోదఁ జొత్తునంచు నీ
కడఁతి నేఁడుగట్టి - పట్టుఁబట్టె॥ 168

ఆ॥ పాలు పొంగుచూపి - పైమూఁత లుబికించి
పడెడు పోల్కి - డెంద - ముడికి నిదుర
కైన నుబ్బి కనుల - యందు నీరై పొర్లుఁ
జెలియ వంత యెంత - చెప్పుదాన॥ 169

గీ॥ ఇచట బుడుతనికి జ్వలి - యిడుచు నేను
దిరుగఁ జప్పునఁ బెన్వాన - గురియఁ జొచ్చె
అంత బిఱబిఱ నీమేడ - చెంతఁ జేరఁ
గంటఁబడినావు మానోము - పంటవలెను॥ 170

క॥ అని చెప్పినఁ దత్తఱపా
టు నెమ్మి యబ్బరమతఁడు క - డున్గని తన మే
ల్కనిపించు మనుచు నద్దా
ది నాలికడకంపి చేరఁ - దీసి కొడుకనిన్॥ 171

ఉ॥ అక్కునఁ జేర్చి ముద్దిడు న - హాయని ముచ్చటలూరుఁ జిన్ని నా
చక్కని తండ్రి నిన్నెడయఁ - జాలితినే యని కంటనీరిడు
న్జక్కెర వెట్టు మచ్చికనొ - నర్చుఁ గురుల్ముడుచు న్నగించు న
న్మక్కువనిపించు విద్దియముఁ లాడఁగఁ జేసెడు మాటిమాటికిన్॥ 172

ఆ॥ బాలసారి యింతఁ - బట్టఁజాలని వేడ్కఁ।
జెలఁగి సంగడీని - చేతికిఁదన।
యనుఁగుఁగొడుకునిచ్చి - యడఁకువ పెంపార।
నొసటఁగేలు వెూడ్చి - నుడివెనిట్లు॥ 173

గీ॥ మిగుల నట్టేట గ్రుక్కలు - మ్రింగుకొనుచు।
నట్టి కొట్టుకొనెడుపట్ల - పట్టునిలువు।
నడుగు నీయయ్యగా నొడ్డు - నందుఁజేర్చి।
నోడగా నీవు నన్నుఁగా - పాడినారు। 174

ఉ॥ ఇంచుక వాండ్రనై నఁదమ-కెక్కుడుగాఁగనుచుంద్రు కోర్కెకా।
సించక కొల్చుకొం డ్రిదుమ - చేసిన వారల కేని మాఱుచె।
ల్లించరు కల్లలెన్నఁడు గ - డించరు మిక్కిలికూర్మియెల్లెడం।
బెంచుదు రేల్నవారలిఁక - మిమ్ముఁదలంచినఁగీడులంటునే॥ 175

ఆ॥ మునువు నీటిలోన - మున్గి యూపిరి యాడ।
కున్న మాడ్కి నిడుమ - లొందుచుంటి।
ఇపుడు పైకిదేలి - న పగిది మీప్రాపు!
వలన మించి మంచి - బ్రతుకుగంటి॥ 176

ఆ॥ అనుచుఁ బల్కఁగ విని - యా రాచకొడుకనె।
సంగడీఁడ యింత - సంతసంబు।
మనకు సమకుఱుటకు - మా యయ్యకత మత।
డొర మాఱు వేలు - పనఁగవచ్చు॥ 177

గీ॥ అయ్య నీయాలుకాఁబోలు - నదిగొ వచ్చు
చుండె నిరుదట్లఁ జెలువల - నొప్పమీఱి।
ఖీఁదియంతరువందు నే - మెులఁగుచుండు।
మించి మీఱిచ్చుటన్నుచ్చ - టించుకొనఁడు॥ 178

క॥ అని రాచపట్టి చనె నె।
ల్లను వెన్నెలచందమామ - కొమరున దాచి॥
న్మనుకొని తనయిల్లాల్రాఁ॥
గనుఁగొని యాబాటసారి - కనుపండువుగాన్॥ 179

గీ॥ పిదప నయ్యాలు మగలు పె - న్వేడ్కనొండొ।
రువుఁ గౌఁగిళ్ళలో బల్ది - డవుగఁ జొక్కి।
నంతఁ బెనిమిటితోడ నా - యతివ పలికె।
జాలి నునుసిగ్గు - కన్గవమేళగింప॥ 180

క॥ నీ కౌఁగిటఁబడు నాడట।
చేకూరు ననుకొన లేదు - చీఁకటిగా నిం।
దాక నగపట్టె నంతయు।
నాఁకలి నిద్దురలు దవ్వ - లయ్యెన్జమిమ్మా॥ 181

గీ॥ ఆసయు న్నందియము డెంద - మందుఁబెనయ।
నెంతయో యోచిఁ తుదకిసు - మంతయైన।
ముందు తెరుకువయగపట్ట - మిం దెగించి।
చిచ్చు చొరఁబాఱునంటి ని - క్కచ్చితోడ॥ 182

గీ॥ అనుచుఁబట్టెడు మగువ న - క్కునగదించి।
కురులు దువ్వుచు ముద్దులు - గొనుచు బాట।
సారి యనె వేల్పు నెమ్మి నో - చాన మనకుఁ।
దెరలె నిక్కట్టులెల్లనా - తెరవువినుము॥ 183

సీ॥ అప్పుడట్లు మున్నీటి - యందుఁ బెన్గాలికిఁ-
దలడిల్లు నోడచా - పలను డించఁ।
జని మెట్ట తాకునఁ - జప్పనఁ ద్రుళ్ళిపైఁ -
బడితి నేమని చెప్ప - వాఁడఁ బిదప।

మున్గితేలుచు నదే - మూలకోకొట్టగఁ -
బడి యొకంతటఁ దెల్వి - వడసి యొడ్డు।
చేరితినని పోల్చి - చేతులున్గాళ్ళు మె -
ల్లనఁగూర్చుకొని లేచి - నిను దలంచి।

కోలబ్రతికితినని యేడ్చి - యేడ్చి సూది।
కొండమీఁదు నొకతేని - దండకరిగి।
వాని నగరున నీదుచే - వ్రాలు చదివి।
మంచినోమున నిన్నుఁగ - న్మఱఁగలసితి॥ 184

పడఁతీ వెనుకటి వంతల।
కడలవలదు మనకు హాయి - నందించిన రా।
కొడుకదె నడతెంచెడు నం
దడితో నేనచటికేగ - ద నని పలుకుచున్॥ 185

చ॥ వడివడి నేగి యిట్లనియె - బాపు రె యేలిక వేడ్క లెవ్వియో।
పాడమినయట్లు తోఁచెననఁ-బొంగుచు రాకొమరుండు సెప్పెని।
క్కడి మన యక్క లల్లొనఁగెఁ - గాంచితి మామ నతండు నాకొ
డంబడి తనకూఁతునిచ్చుటకు-మాటనొసంగెను జుమ్మి నెయ్యుఁడా॥

క। నన్నుఁబోలువాని - నా మామ వెదకియుఁ।
గాంచలేక యిట్టు - కట్టునడియె।
వేఱు నడతలగుటఁ - బెండ్లి మా నగరున।
నలువుకొనఁగ నెల వో - సంగినాఁడు॥

క॥ అనుచు నతఁను పల్కు - నంతఁజెలులుచ్చుట్టు।
గొల్చుచుండఁ బెండ్లి - కూఁతురరుగు।
దెంచె హాయలుమీఱ - దివ్యాలయందునఁ।
దనరు మేటి తెలి మ - తాబువలెను॥ 188

క॥ అప్పుడడుగులు దడఁబడ।
గుప్పునఁ బూఁదావులీను - కొప్పుసడల సి।
గ్గొప్పఁ బసినాటి చనవున।
నప్పడఁతుక మగనికేలి - నందె బిత్తానన్। 189

గీ॥ ముత్తెపుఁ జిఱునగవు మొల - కెత్తుచుండఁ।
జీఁకటి మెఱుపు వాల్చూపు - చిమ్ముచుండ।
పల్కు తల్కులఁ బయ్యెద - కొంగు సరదు।
కొంచు బావా! యనుచుఁ - బల్కరించునంత॥ 190

నట్టువు॥ పొంగుచు మేనుగగుర్పొడువన్దమి - పొదలంగఁ బువ్విలుతుని వలె రా।
సిం[illegible] మైమఱపుంగొని చెంగటి - చెలువఁగనుఁగొనక కవుఁగిలిలో
నం గదియించి తనుం గడుముద్దిడ - నగి చెలి పెనఁగిఁ జెలు నటు క।
న్నుంగవ తార్పులఁబయ్యెద జాఱ్పుల - నఁబలు నాఱు నెఱపెఁ జెలువముగాన్॥ 91

గీ॥ ఇట్లు బులుపుమున్నీటిలో - నీఁదులాడు।
వారిఁదోడ్కొని యాబాట - సారి కడలి।
దాఁటి కొన్నాళ్ళకు దన - మేటిసంగ।
డీని నప్పెండ్లికొడుకు తం - డ్రినిగని యనె॥ 192

క॥ తేఁడా కను నీకొడుకు।
న్గోడలిని నీ్వరె నాదు - కోమలి బుడుతల్।
నేఁడు మొద లీ్నివారము।
వేడుకతో మమ్మునింకఁ - బెంచఁగవలయున్॥ 193

ఆ॥ అనఁగ జేఁడు వలికె - నా బాటసారితో।
మీరు మేముకలసి - మెలసి హాయి।
చెలఁగ మనుదమింకఁ - గలకాల మొక్కటి।
యగుచుఁ బాల నేయి - యలరుమాడ్కి॥ 194

చ॥ అనవిని బాటసారి కడు - హాయిగ నంతటనుండి కోరిన।
ట్లనయముఁ దన్విమీర జగ - మంతయు నొక్కటఁదానయైన తీ।
రున నెదురెందునన్గనక - క్రొత్తతనర్పుల నిచ్చలందుచు।
న్మనుగడ రేపుమాపులొక - మచ్చునఁ నెల్లెడ మెచ్చఁబొందెడున్॥

— 0 —

# శ్రీ నారాయణ దాస

# జీవిత పంచాంగము

31-8-1864 జననము (రక్తాక్షి శ్రావణ బహుళ దశమి రాత్రి).

1869 శివరాత్రి – స్వప్రజ్ఞయా భాగవత బహుమాన గ్రహణము.

1874 సంగీతాభ్యాసార్థము వాసా సాంబయ్యగారితో బొబ్బిలి ప్రయాణము.

1875 తల్లిదండ్రులతో కాలినడకను జగన్నాథ యాత్ర.

1877 సింహాచలయాత్ర – పితృవియోగము.

1880 విజయనగరములో ఆంగ్ల పాఠశాలా ప్రవేశము.

1883 హరికథావతారము – విజయనగరము వేణుగోపాలస్వామి ఆలయములో ప్రథమ కథాగానము – 'ధ్రువచరిత్ర' రచనము.

1884-85 ఉత్తరదేశమున హరికథా యాత్ర–ఛత్రపురమున ఒక్క రాత్రిలో 'అంబరీషచరిత్ర' హరికథారచన, మరునాడే ప్రదర్శన–లోకనాథము గ్రామమున మొట్టమొదటి సంగీత సాహిత్యాష్టావధానము.

1886 మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణత – విశాఖపట్టణమున రెండు నెలలలో పంద్రెండు హరికథలు – విజయనగరములో విక్టోరియారాణి జూబిలీకి ప్రభుత్వాహ్వానముపై హరికథాగానము–'గజేంద్రమోక్షణ' రచన – వివాహము – వీణావాదనాభ్యాస ప్రారంభము.

1886-88 విశాఖపట్టణమున F. A. చదువు – ఖాసింకోట జమీందారుగారిని రెండు హరికథలు చేసి మెప్పించి స్కాలరుషిప్పు సంపాదించుట – విశాఖలో 80 హరికథలు – అల్లిపురము జమీందారు హవేలీలో అనేకావధానములు – పిఠాపుర రాజ సన్మానము.

1888-89 జాటసారి కావ్యరచన – కాకినాడ నాటక సమాజము వారికి కాళిదాస 'విక్రమోర్వశీయ' రూపక ప్రదర్శన శిక్షణ – రాజపాత్రధారణ – బందరులో టికెట్టు పెట్టి సంగీత సాహిత్యాష్టావధానము – కొందరు సంగీత విద్వాంసులకు శృంగభంగము చేయుట.

1890 డంభపుర ప్రహసన రచన – సారంగధర నాటక రచన – గంజాము మండల పర్యటన – ఉర్లాము బుకులాము అందు హరికథాగానము.

1891 మార్కండేయ చరిత్ర రచన.

1894 స్వీయచరిత్ర రచన-మదరాసులో రావ్ బహదూర్ పనప్పాకం అనందాచార్యులవారి నివాసమున హరికథా గానము – 25-8-94 న బెంగుళూరులో మైసూరు ప్రభువుముందు సంగీత కాలక్షేపము, హరికథాగానము-తథాపి సత్కారము.

1895 మైసూరు ప్రభువుచే దసరా దర్బారులో ఘన సన్మానము – ఆనంద గజపతిగారి ఆదరణ–సత్యవ్రతి, సూర్యనారాయణ శతకముల రచన–కాసింకోట కోటలో హరికథాగానము, తిరుపతి వెంకట కవుల శ్లాఘ.

1898 ప్రహ్లాదచరిత్ర రచన, (అప్పటికి రుక్మిణీకల్యాణ, హరిశ్చంద్ర చరిత్రలు, శ్రీకృష్ణజననము సంస్కృత హరికథ విరచితములు).

1900–1901 ఉర్దూ పార్సీ అరబ్బీ భాషల అభ్యాసము,

1902 భీష్మచరిత్ర, సావిత్రీ చరిత్రముల రచన.

1903 ఏకైక పుత్రిక సావిత్రమ్మ జననము.

1904 ప్రత్యేకాహ్వానముపై బెంగుళూరు దాక్షిణాత్యగాయక మహాసభలలో రుక్మిణీకల్యాణ హరికథాగానము-అందు దక్షిణామూర్తిపిళ్లె అను మార్దంగికునకు గుణపాఠము – కాకినాడ సరస్వతీ గానసభా స్థాపనము. (నాటనుండి 1942 వరకు ప్రతియేట తత్సభా ప్రారంభోత్సవము దాసుగారి కథాగానముతోనే ప్రారంభమగుట ఆచారము).

1905 మాతృ వియోగము.

1908 భంగు వ్యసన త్యాగము – ముకుంద, శివ శతక మృత్యుంజయాష్టక రచన.

1910 'తారకమ్' అను సంస్కృత ప్రబంధరచన – జర్మన్ ప్రొఫెసర్ గిల్డ్నరు కృత శ్లాఘ.

1911–12 రాజమహేంద్రవరమున వీరేశలింగము పంతులుగారిచే నవరత్న భుజకీర్తిప్రదాన సన్మానము.

1912–13 విజయనగరమున రీవా సర్కారుచే సన్మానము.

1913 కాశీయాత్ర - అలహాబాదులో జానకీబాయి మెప్పు - కలకత్తాలో 'శ్రీకృష్ణజననము' హరికథ - విశ్వకవి రవీంద్రుని ప్రశంస.

1914 బందరులో వీణావాదన ప్రజ్ఞకు పల్లపల్లి ప్రభువులచే గండపెండేర సన్మానము - కాశీ శతక రచన - (1908-1914 సం॥ల నడుమ దేశమున పలుతావుల హరికథా కాలక్షేపములు, ఘన సన్మానములు.) నూజివీడులో గజారోహణ, నందిగామలో బ్రహ్మరథ సన్మానములు. పంచతాళప్రజ్ఞ పరిశీలించి సుబ్రహ్మణ్యయ్యరు వీరఘంటా వలయము విప్పించి, పంచముఖీ పరమేశ్వరు డను బిరు దందుట.

1916 భార్యా వియోగము - యథార్థ రామాయణ రచన.

1919 విజయరామగజపతి సంగీతకళాశాల ప్రిన్సిపాలు పదవి నధిష్ఠించుట.

1921 రామచంద్ర శతక రచన.

1922 పసుమర్తి కృష్ణమూర్తిగారి పార్వతీకళ్యాణ యక్షగానము కృతిపతిత్వము - 'నవరస తరంగిణి' ప్రకటన.

1923 కాకినాడ కాంగ్రెసు మహాసభలో హరికథా కాలక్షేపము - సరోజినీ దేవి ప్రశంస లందుట - ఇంగ్లండులోని Empire Exhibition కు భారత సంగీత ప్రతినిధిగా ఆహ్వానము (కాని వెళ్ళలేదు).

30-8-1924 విజయనగరములో షష్టిపూర్తి మహోత్సవము.

1927 కి ముందు 'వెన్నుని వేయిపేర్ల వినకరి' (విష్ణు సహస్రనామ సంకీర్తనము) రచన.

1927 మదరాసు అఖిల భారత సంగీత పరిషత్ప్రారంభోత్సవములో స్వవిరచితములైన 'స్వరాక్షర' కృతులను పాడి ఆచార్య పి. సాంబమూర్తి ప్రభృతుల ప్రశంస లందుట.

1928 మదరాసు పుర ప్రముఖుల మహాసభలలో హరికథలు చేసి "ఆంధ్రదేశ భూషణము"గా ప్రశస్తులగుట.

1929 'అచ్చ తెలుగు పలుకుబడి' 'వేల్పుమాట,' 'మ్రొక్కుబడి' రచన - విజయనగరములో నవగ్రహాలయ ప్రతిష్ఠ.

1930 'వేల్పువంద,' 'హరికథామృతమ్' ప్రచురణ. 'గౌరప్పపెండ్లి' రచన.

.931 గుంటూరులో జరిగిన సప్తమ అఖిలాంధ్ర గాయక మహాసభ కధ్యక్షత – అలక నారాయణ గజపతి ప్రభువుతో నీలగిరి ప్రయాణము–అక్కడ వివిధ సంస్థానాధీశులను గానముచే మెప్పించుట

1932 తేది 11–2–32 న కొత్తపేటలో హరికథా భవనమునకు శంకుస్థాపనము – ఉమరుకైయాము రచన, ప్రచురణ.

1933 విశాఖపట్టణమున ప్రభల లక్ష్మీనరసింహముగారిచే సన్మానము – రాజా విక్రమదేవవర్మగారిచే "సంగీత సాహిత్య సార్వభౌమ." 'భారతితీర్థ' సంస్థచే "ఆటపాటలమేటి" బిరుద ప్రదానము.
తేది 8–2–33 న విశాఖపట్టణమున జరిగిన యొక సభలో "శృంగార సర్వజ్ఞ" బిరుద ప్రతిగ్రహణము.
తేది 9–11–33 న తునిలో బ్రహ్మరథ సన్మానము.

1936 సంగీత కళాశాలాధ్యక్ష పదవీ విరమణము – హైదరాబాదులో ఆంధ్ర మిత్రమండలి సన్మానము.

19–5–1937 ఇల్లెందు పుర వాస్తవ్యులచే పండిత సన్మానము.

1938 సశిష్యముగా రామేశ్వర యాత్ర–పుదుక్కోట తిరువాన్కూరుదర్బారు సన్మానములు–కన్యాకుమారీ దర్శనము–"దశవిధరాగనవతి కుసుమ మంజరి" రచనము–చెన్నపురి ఆంధ్ర మహాసభా సన్మానము.

2–2–39 బార్ట్వెల్ దొర 'నోబెలు' బహుమతి లబ్ధికై ప్రోత్సహించుట (కాని దాసుగా రా ప్రయత్నము చేయలేదు).

10–4–39 మదరాసులో మరియొక సన్మానము.

1939–43 "సీమపల్కువహి" అను దేశ్యాంధ్రనిఘంటు నిర్మాణము : ఆయుర్వేద పరిశోధనము–"మిన్కుమిన్కు"రచనము; "జగజ్జ్యోతి"–రచన–

1–5–43 విజయనగరములో ఆంధ్ర కళాపరిషత్ప్రారంభోత్సవ సభాధ్యక్షత.

1943–45 'తల్లివిన్కి' రచన, (లలితాసహస్రనామమునకు దేశ్యాంధ్రవివృతి).

–1945 పరమపదప్రాప్తి (మనుమనికి మళ్ళీ రాగా భగవంతుని ప్రార్థించి దానిని తా నాకర్షించుకొని మనుమని బ్రతికించిరని ప్రతీతి).

[పరికల్పన : ఆచార్య యస్వీ జోగారావు]

# దాసభారతీ ప్రచురణములు

1. మేలుబంతి : చాటు ప్రబంధము (అనేక పటములతో) పుటలు 280. వెల 12 రూ. సంపాదకుడు : యస్వీ జోగారావు.

2. కచ్ఛపీ శ్రుతులు : దాసుగారి సర్వకావ్యములనుండి యేర్చికూర్చిన పలుచక్కని పద్యముల సంకలనము. పుటలు 200. వెల 10 రూ. సంపాదకుడు : యస్వీ జోగారావు.

3. వ్యాసపీఠము : భాషా సాహిత్య జీవిత సంబంధులగు అనేక విషయములపై విమర్శనాత్మకములు, సృజనాత్మకములు నగు వ్యాసముల సంపుటి - పుటలు 370. వెల 20 రూ. సంపాదకుడు : యస్వీ జోగారావు.

4. నా యెఱుక: దాసుగారి స్వీయచరిత్ర అనేక(పటములతో)పుటలు 450. వెల 22 రూ॥ సంపాదకుడు : యస్వీ జోగారావు.

5. తల్లివిన్కి : లలితసహస్రనామముల పరమార్థ ప్రకాశిక - అచ్చ తెలుగుపద్యములందు వివృతి. పుటలు సుమారు 310. వెల 15 రు. సంపాదకులు : ఆచార్య శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి.

6. సంస్కృత శతక ద్వయము (కాశీ, రామచంద్రశతకములు - శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారి తెలుగు & డాక్టర్ శ్రీ "భాను"గారి హిందీ అనువాదములతో) సుమారు 210 పుటలు. వెల 7 రూ.

7. పంచశతి : (పూర్యనారాయణ, శివ, ముకుంద, సత్యవ్రత, వేల్పువంద) సుమారు 120 పుటలు. వెల 5 రూ. సంపాదకుడు : శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు.

8. నూఱుగంటి : (నీతికథా మంజూష) సంపాదకుడు : శ్రీ మన్నవ గిరిధరరావు. సుమారు 80 పుటలు. వెల 3 రూ.

9. చాటసారి (పద్యకావ్యము) సుమారు 58 పుటలు. వెల 4 రూ.

10. జగజ్జ్యోతి (భారతీయ సంవిత్సర్వస్వము) (శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారి క్లుప్తీకరణము) పుటలు 180 వెల 10 రూ.

11. మహాకవి శ్రీ ఆదిభట్ల నారాయణదాస చరిత్రము కృతికర్త శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ, పుటలు 220. వెల 6_50 రూ.

12. The Lights of the worlds - An abridgement and translation of the Jagajjyoti, an astounding product of learning and genius of Narayanadas by Sri Peri Suryanarayana Sastri B. A. L. T. (dealing with the Eighteen disciplines of the ancient Indian wisdom with Introduction by Prof. G J. Somayaji M. A. L. T.) 200 pages. Price 10 Rs.

13. నవరసతరంగిణి : షేక్స్పియర్, కాళిదాస మహాకవుల కృతుల లోని కవితాసౌందర్యము, కవితామధురిమ, భావనావైశిష్ట్యము లను తులనాత్మకముగా, నవరసముల సమన్వయముతో సాగిన దాసుగారి విశిష్ట గ్రంథమిది. పుటలు 750. వెల 80_00 రూ.

## అచిర కాలములో

14. సారంగధర : ధర్మవరము వారి 'విషాద సారంగధర' నాటకము తరువాత అంతటి బహుళజనాదరణము నందినది దాసుగారి 'సారంగధర'. ప్రాక్ ప్రతీచీ నాటకనిర్మాణ మార్గములను రెండింటిని చక్కగా మేళవించి చేసిన రచన యిది.

